# పాపం యీ దంతం హత్యచేయబడింది!



మరీ దారుణంగా. కొంచెంకొంచెంగా విషం ఇచ్చి చంపేసేట్లు. చిట్ట చివరి క్షణం దాకా, అంటే పన్ను ఊడి వచ్చేసేదాకా యీ ఘోరమైన సత్యం తెలియనేలేదు, తెలిసినదేమిటంటే — తెలిసి చేసిన అశ్రద్ధ అది. అటువంటి సరియైనరీతిని టూత్‌బ్రష్‌తోనూ, టూత్‌పేస్ట్‌తోనూ పళ్ళను తోమటం.

మరి బినాకా ఫ్లోరైడ్ గనక తప్పకుండా ఎప్పుడూ వాడివున్నట్లయితే, యీ విషాద సంఘటన జరిగివుండేది కాదు, ఎందువల్లనంటే, బినాకా ఫ్లోరైడ్‌లోగల యుఎమ్ఎఫ్‌పి మూడు విధాలుగా పళ్ళల్లోని కంతల్నుంచీ దంతక్షయాన్నుంచీ రక్షిస్తుంది.



- పంటి ఎనామిల్‌ని గట్టిపరచటానికి
- నోటిలో తయారయ్యే ఏసిడ్ తయారు కాకుండానూ
- దంతక్షయాన్ని అరికట్టటానికి

మీ పళ్ళని హత్య చేయకండి
మీ పళ్ళని కాపాడుకోవటం కోసం

## బినాకా ఫ్లోరైడ్




C I B A Contricta

ULKA-CF-38-TEL

హలో! నేనే!
బేబీరాణిని! మీరు
చందమామలో
భలే భలే సాహస
గాథలు చదువుతూ
ఉంటారుగా!
నా కథ కూడా
అటువంటి
సాహసగాథే!
కానీ - ఆ కథ చెప్తే
బాగుండదు! అందుకే
మీ అమ్మలతో
నాన్నలతో కలిసివచ్చి
చూడండి!



వాసంతి సమర్పించు
శ్రీ కళ్యాణాలయా

# భలే పాప

దర్శకత్వం - కె. ఎస్. ప్రకాశరావు
నిర్మాత - వాసంతి B.A



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ ["కలల ప్రభావం"]కు ఆధారం ఎం. వి. శేష గిరిరావు పంపిన కథ.

పాలకులు మంచి శాసనాలు చేయగానే కాదు, వాటి వెనక ఉండే ఆశయాల ఆచరణ గురించి కూడా వారికి తెలియాలి. ఈ నీతి "మూగప్రేమ" అన్న కథలో ఉన్నది.

శాస్త్రజ్ఞానం ఎంత ఉన్నప్పటికీ దానికి లోకజ్ఞానమూ, ఊహాశక్తీ తోడు కాకపోతే అది బాగా రాణించదు. ఈ నీతి "ఇద్దరు జ్యోతిష్కులు" లో ఉన్నది.

సంపుటి 49 సెప్టెంబర్ '71 సంచిక 3




న కస్యచి త్కశ్చి దిహ స్వభావాత్ భవ త్యుదారో ఽభిమతః ఖలో వా ;
లోకే గురుత్వం విపరీతతాం వా స్వచేష్టితా న్యేవ నరం నయంతి—1

[లోకంలో ఎవరూ ఎవరికి స్వభావంవల్ల మాత్రమే గొప్పవాడూ, చెడ్డవాడూ అనిపించరు; మనిషియొక్క గొప్పతనమూ, అల్పత్వమూ వారు చేసే పనులవల్లనే కలుగుతుంది.]

దారేషు కించిత్, స్వజనేషు కించిత్,
గోప్యం వయస్యేషు, సుతేషు కించిత్,
యుక్తం న వా యుక్త మిదం విచింత్య
వదే ద్విపశ్చి న్మహతో నురోధాత్—2

[భార్యకు చెప్పకూడనివి, బంధువులకు చెప్పకూడనివి, స్నేహితులకూ, కుమారులకూ చెప్పకూడనివి కొన్నికొన్ని ఉంటాయి. ఏది యుక్తమో, ఏది కాదో తెలుసుకుంటూ తెలివిగలవారు పెద్దలతోసహ నడవాలి.]

మృగా మృగైః సంగ మనువ్రజంతి,
గావశ్చ గోభిః, తురగా స్తురంగైః,
మూర్ఖాశ్చ మూర్ఖైః, సుధియః సుధీభిః ;
సమాన శీలవ్యసనేషు సఖ్యం—3

[మృగాలు మృగాలతోనూ, గోవులు గోవులతోనూ, గుర్రాలు గుర్రాలతోనూ చేరుతాయి. మూర్ఖులు మూర్ఖులతో చేరుతారు. బుద్ధిమంతులు బుద్ధిమంతులతో చేరుతారు. గుణ దోషాలు సమంగా ఉంటేనే సఖ్యం సాధ్యం.]

మనుష్య సంబంధాలు



# నిజమైన అబద్ధం

ఒక గ్రామంలో రామయ్యా, భీమయ్యా అనే ఇద్దరు ఆసాములు ఇరుగుపొరుగున ఉండేవారు. తన కన్న భీమయ్యకు ఎక్కువ ఆస్తిపాస్తు లుండటం వల్ల రామయ్యకు కన్ను కుట్టింది. భీమయ్యను ఎలాగైనా గ్రామం నుంచి పంపించివేయటానికి రామయ్య ఒక ఉపాయం ఆలోచించాడు.

ఒకనాటి అర్ధరాత్రి రామయ్య తన ఇంట్లో ఉన్న కొన్ని సామాన్లు దాచేసి, ఒకటి, రెండు వస్తువులను భీమయ్య పెరట్లో పడేశాడు. తెల్లవారుతూనే రామయ్య తన ఇంటిని దొంగలు దోచారని మొత్తుకుంటూ శివతాండవం చెయ్యసాగాడు.

రామయ్య పోయాయన్న వస్తువులలో రెండు భీమయ్య పెరట్లో దొరికాయి. "నా ఇంట్లో భీమయ్య దొంగతనం చేశాడు. ఇంకేముంది?" అని రామయ్య ఊళ్ళోవాళ్ళందరి దగ్గిరా మొత్తుకున్నాడు. భీమయ్య పెరట్లో వస్తువులు దొరకటం చేత ఊళ్ళో వాళ్ళు రామయ్య మాటలు నమ్మారు.

"నా కేమీ తెలీదు!" అని భీమయ్య ఎంత మొరపెట్టినా అతని మాటలు ఎవరూ నమ్మలేదు. గ్రామాధికారులు రామయ్యనూ, భీమయ్యనూ పిలిపించారు.

"నే నేపాపమూ ఎరగను. నా మాట నమ్మండి," అని భీమయ్య అన్నాడు.

"అయితే, రామయ్య వస్తువులు నీ పెరట్లోకి ఎలా వచ్చాయి?" అని గ్రామాధికారులు భీమయ్యను అడిగారు.

"అది దేవుడికే తెలియాలి. నేను మాత్రం నిరపరాధిని." అన్నాడు భీమయ్య.

గ్రామాధికారులు రామయ్య ఇంట పోయాయన్న వస్తువుల జాబితా తీసుకుని, "మేము విచారిస్తాం. ఇక మీ రిద్దరూ వెళ్ళండి," అని రామయ్యనూ, భీమయ్యనూ పంపేశారు.

కాళ్ళ గోవిందరావు

ఇది జరిగిన రోజు సాయంకాలమే రామయ్య అవసరమైన పని మీద పొరుగూరు వెళ్ళవలసి వచ్చింది. ఆ రాత్రి రామయ్య భార్య ఒక్కతే ఇంట్లో ఉన్న సమయంలో దొంగలు పడి, రామయ్య దాచినదీ, దాయనిదీ కూడా చాలామటుకు దోచుకుపోయారు.

తెల్లవారి రామయ్య భార్య తమ ఇంట దొంగలు పడ్డారని మొత్తుకున్నది. ఈ విషయం ఊరంతా తెలిసింది. గ్రామాధికారులు ఈ సంగతి విని, రామయ్య ఇంటికి వెళ్ళి, రామయ్య భార్య నడిగి, పోయిన వస్తువుల జాబితా రాసుకున్నారు. భీమయ్య దొంగిలించాడన్న వస్తువుల జాబితాతో రామయ్య భార్య చెప్పిన వస్తువుల జాబితాను పోల్చి చూస్తే, మొదటి జాబితాలో ఉన్న వస్తువులన్నీ రెండవ జాబితాలో నూ ఉన్నాయి. గ్రామాధికార్లు నిజం గ్రహించి, రామయ్య తిరిగి రాగానే తమ వద్దకు పంపమని రామయ్య భార్యతో చెప్పి, వెళ్ళిపోయారు.

పొరుగూరి నుంచి తిరిగి వస్తూనే రామయ్య జరిగినది తెలుసుకుని, తాను భీమయ్యకు అంటగట్టిన దొంగతనం నిజంగానే జరిగినందుకు లబోదిబో మన్నాడు.

గ్రామాధికారులు రామయ్యతో, "మొన్న నీ ఇంట దొంగతనం జరిగిందని చెప్పి పోయిన వస్తువుల జాబితా ఇచ్చావు. నిన్న రాత్రి మళ్ళీ దొంగతనం జరిగిందని చెప్పి నీ భార్య, పోయిన వస్తువుల జాబితా ఇచ్చింది. ఇవిగో రెండు జాబితాలూ. మొన్న పోయిన వస్తువులన్నీ నిన్న మళ్ళీ ఎలా పోయాయి? నువు భీమయ్య మీద లేని దొంగతనం ఆరోపించటానికి కుట్ర చేసినట్టు స్పష్టమవుతున్నది. అందుచేత నువు భీమయ్యకు క్షమాపణ చెప్పుకుని, నష్టపరిహారం చెల్లించుకుని, గ్రామం వదిలి వెళ్ళిపో!" అన్నారు.

భీమయ్యకు చేయించా లనుకున్నది రామయ్యకే జరిగింది. అతను సామాన్లూ, పశువులూ పోగొట్టుకుని, గ్రామాంతరం వెళ్ళిపోయాడు.





# వరాలిచ్చే వనదేవత

ఒక ఊళ్ళో ఇద్దరు అన్నదమ్ములుండే వాళ్ళు. అన్న స్వార్థపరుడు. తమ్ముడు అమాయకుడు. తండ్రి పోగానే, అన్న ఆస్తి అంతా తీసేసుకుని తమ్ముడికి ఏమీ లేకుండా చెయ్యాలని చూశాడు; కాని, నలుగురు పెద్ద మనుషులలా చివాట్లు పెట్టిన మీదట, తమ పెరట్లో ఉన్న గొడ్లపాకను తమ్ముడికి పంచి ఇచ్చాడు. అమాయకుడు కావటం చేత తమ్ముడు దానితోనే తృప్తిపడ్డాడు.

తమ్ముడు ఆపని, ఈపని చేసి తన పెళ్ళాన్నీ, పిల్లలనూ ఎలాగో పోషించు కుంటూ వస్తున్నాడు. అన్న మటుకు తనవద్ద ఉన్న డబ్బును వడ్డీకి ఇవ్వుతూ, తన పెళ్ళాంతో హాయిగా జీవిస్తున్నాడు.

తమ్ముడి సంపాదన ఏనాడూ అతని కుటుంబం అవసరాలకు సరిపోయేది కాదు. అందుచేత వారికి ఏ విషయంలోనూ సంతృప్తి అనేది ఉండేది కాదు. ఆ కారణంగా తమ్ముడు అన్న వద్ద అప్పుడప్పుడూ అప్పు తీసుకునే వాడు. ఆ అప్పు ఎలాగూ తీరేది కాదు గనక, అప్పు కొంతదాకా పెరిగిన మీదట ఆ గొడ్లపాక కూడా స్వాధీనం చేసుకుని, అక్కడ మరొక ఇల్లు కట్టాలనే ఉద్దేశంలో ఉన్నాడు అన్న.

ఇలా ఉండగా తమ్ముడు అడవిదాటి ఒక ఊరు వెళ్ళవలిసి వచ్చింది. అతను ఆ ఊరు వెళ్ళి తన పని చూసుకుని వేకువ జామునే బయలుదేరి తన ఊరు వస్తున్నాడు. సూర్యోదయం అయేసరికి అతను ఒక చిన్న కొలను దగ్గిరికి వచ్చాడు. ఆ కొలనులో ఒకే ఒక బంగారు రంగుగల తామర మొగ్గ ఉన్నది. తమ్ముడు చూస్తూ ఉండగానే ఆ మొగ్గ మీద సూర్యకిరణాలు పడ్డాయి. వెంటనే అది విచ్చుకున్నది.

అపూర్వమైన ఆ బంగారు తామర పుష్పాన్ని చూసి ముగ్ధుడై తమ్ముడు దాన్ని

ఎమ్. కామేశ్వరరావు



కోసుకున్నాడు. ఆ క్షణంలో అక్కడ ఒక స్త్రీ ప్రత్యక్షమయింది. ఆమె దేవతా స్త్రీలాగా కనిపించేసరికి, తమ్ముడు ఆమెకు నమస్కరించాడు.

ఆ దేవతాస్త్రీ అతనితో, "ఈ కొలనులో రోజూ ఒకే ఒక పుష్పం పూస్తుంది. దాన్ని నేను నా పూజకు ఉపయోగించుకుంటాను. అందుచేత నువ్వు కోసిన పుష్పాన్ని నాకిచ్చి, దానికి బదులుగా ఏదైనా వరం కోరుకో," అని చెప్పింది.

తమ్ముడు పశ్చాత్తాపంతో, "దేవీ, నేను తెలియక కొలనులో దిగి ఈ పుష్పాన్ని కోశాను. ఆ కారణంగా తప్పు నాదే. ఈ భాగ్యానికి వరందేనికి? నీ పుష్పాన్ని నువ్వు తీసుకో," అంటూ బంగారుకమలాన్ని ఆమె కిచ్చాడు.

"నువ్వు చాలా మంచివాడివి. నీ మంచి తనానికి మెచ్చి వరం ఇవ్వదలిచాను. ఏదైనా కోరుకో," అన్నదామె.

తమ్ముడు కొంచెం ఆలోచించి, "దేవీ, పేదరికం చేత మా ఇంటిల్లిపాది అసంతృప్తితో బతుకుతూ ఉన్నాం. మాకు ఏ నాటికీ అసంతృప్తి అనేది లేకుండా అనుగ్రహించు," అన్నాడు.

"చాలా తెలివిగా వరం కోరావు. ఏ వరం కోరినా మనిషి చివరకు కోరేది సంతృప్తే. మరొక వరం కోరినట్టయితే, ఇంకా మంచి వరం కోరలేకపోతినే అన్న అసంతృప్తి నీకు ఉండేదే," అని చెప్పి దేవతాస్త్రీ అదృశ్యమయింది.

తమ్ముడు సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చాడు. అది మొదలు అతని ఇంటి జీవితమే మారిపోయింది. అతను ఎంత తీసుకువచ్చినా అందరికీ సరిపోవటమే గాక, కొంత మిగులుతున్నది. అతని ఇంట ఏ విషయంలోనూ ఎవరికీ అసంతృప్తి అన్నది లేదు. అతను అన్న దగ్గిరికి అప్పు కోసం వెళ్ళకపోగా, చేసిన అప్పులన్నీ క్రమంగా తీర్చేశాడు.

తమ్ముడి సంసారం పచ్చగా ఉన్నట్టు కనబడేసరికి, వాళ్ళకేదో నిధి దొరికి ఉంటుం

దను కున్నాడు అన్న. తమ్ముడు బోళావాడు గనక అడిగితే చెప్పేస్తాడనుకుని వెళ్ళి, "ఏం, తమ్ముడూ? అంతా కులాసాగా ఉంటున్నారా? నా అప్పంతా తీర్చేశావు. మళ్ళీ అప్పుకు అంటూ రాలేదు. ఏమిటి విశేషం? నా దగ్గిర దాపరికం దేనికి?" అన్నాడు.

"ఏమీ లేదు, అన్నయ్యా. ఉన్నదాంతోనే మాకు జరుగుబాటు అవుతున్నది. అంతే కాక నేను కష్టపడి సంపాయించేదాంట్లో కాస్త కూస్త మిగులుతున్నది కూడా. ఏ కొరతా లేకుండా బతుకుతున్నాం," అన్నాడు తమ్ముడు.

అన్న నవ్వి, "నా దగ్గిర దాస్తున్నావు. ఏదో నిధి దొరికి ఉంటుంది. లేకపోతే, ఇంత కాలమూ లేని జరుగుబాటు ఇప్పుడెలా వచ్చింది?" అన్నాడు.

తమ్ముడు దాచకుండా అన్నతో, అడవిలో కొలను గురించీ, తామరపువ్వు గురించీ, దేవత గురించీ, ఆమె ఇచ్చిన వరం గురించీ, వివరంగా చెప్పాడు.

అంతా విని అన్న తమ్ముడితో ఏమీ అనకుండా, ఇంటికి వచ్చేసి, దేవతను ఏం వరం కోరాలో తెల్లవార్లూ ఆలోచించి తేల్చుకున్నాడు. అతను మర్నాడు ఉదయం సూర్యోదయం కాక పూర్వమే అడవిలో ఉన్న కొలను చేరుకున్నాడు. కొలనులో ఒకే ఒక బంగారు తామరమొగ్గ ఉన్నది. సూర్య కిరణాలు తనమీద పడగానే అది విచ్చుకున్నది. వెంటనే అన్న దాన్ని కోసేసి,



తన రెండు చేతులమధ్య గట్టిగా పట్టుకున్నాడు.

అంతలో వనదేవత రానేవచ్చింది. ఆమె అన్ననూ, అతను పుష్పంపట్టుకున్న వాలకాన్నీ చూసి, అతను కావాలనే ఆ పని చేశాడని గ్రహించి, "ఆ పుష్పం నాది, నాకిచ్చెయ్యి," అన్నది.

అన్న వెకిలిగా నవ్వి, "నాకు వరమిస్తే పుష్పం ఇస్తా, లేకపోతే ఇవ్వను," అన్నాడు.

వనదేవత వాణ్ణి చూసి అసహ్యించుకుంటూ, "నీ కేం వరంకావాలి?" అని అడిగింది.

ముందే ఆలోచించి పెట్టుకున్న అన్న, "నేను అనుకున్న వెల్లా జరగాలి," అన్నాడు.

వనదేవత వాడికి అలాగే వరం ఇచ్చి, బంగారు కమలం తీసుకున్నది.

అన్న ఆనందానికి మేరలేదు. కొలను గట్టున ఉన్న మామిడి చెట్టునిండా పళ్ళుండాలి అనుకున్నాడు. అలాగే జరిగింది. వాడు తినగలిగిన్ని పళ్ళు తిని, ఇంటికి వెళ్ళి, తన ఇల్లు పెద్ద భవంతి కావాలనుకున్నాడు. అలాగే జరిగింది. వాళ్ళు తినడానికి లోటు లేదుగనక ఇంట్లోవారికి పంచభక్ష్య పరమాన్నాలతో విందు ఆరగించారు.

ఆ సాయంకాలం అన్నభార్య తనతోటి కోడలికీ, మరిదికీ తమ గొప్ప చెప్పుకోవటానికి పాకకు వెళ్ళింది. ఆమె చీకటిపడి పాక నుంచి వస్తుండగా గదిలో పరధ్యానంగా కూర్చుని ఉన్న అన్న పెరట్లోకి తొంగి చూసేసరికి ఎవరో నల్లగా తమ ఇంటికేసి రావటం కనిపించింది.

"బాబోయ్, అది దయ్యమేమో! లోపలికి రాదుగద?" అని అన్న భయపడ్డాడు.

వెంటనే అన్నభార్య దయ్యంగా మారి ఇంట్లో ప్రవేశించింది.

"ఈ దయ్యం నన్ను మింగేస్తుందేమో!" అని మళ్ళీ అనుకున్నాడు అన్న.

అంత పనీ జరిగింది. దయ్యం అన్నను మింగేసి ఎటో వెళ్ళిపోయింది.

అన్నకు పిల్లలు లేకపోవటం చేత అతని భవంతి, మిగిలిన ఆస్తి తమ్ముడికే సంక్రమించింది.






## 12

[ఖడ్గ జీవదత్తులకు రాత్రి తన భవనంలో ఆతిథ్యం ఇచ్చిన వసుమతి అనే గంధర్వుడు మర్నాటి ఉదయం జీవదత్తుడితో ద్వంద్వయుద్ధానికి పూనుకున్నాడు. జీవదత్తుడు అతణ్ణి గుర్రం మీది నుంచి కిందికి పడదోశాడు. వసుమతికి సహాయంగా గండ్రగొడ్డలి యువకుడు వచ్చాడు. ఖడ్గవర్మ అతడి నెత్తిన కత్తిపిడితో గట్టిగా కొట్టాడు. తరవాత—]

తన బావమరిది చావుకేక పెట్టి కింద పడటం చూస్తూనే వసుమతి పెద్దగా నవ్వుతూ, "ఖడ్గవర్మా! మంచి పని చేశావు. నీ దెబ్బకు వాడి తల పగిలి వుండదు. అది నల్లరాతికన్నా గట్టిది," అన్నాడు.

జీవదత్తుడికి ఆ మాటలు చాలా నవ్వు తెప్పించినై. కాని అదే సమయంలో అతడికి గండ్రగొడ్డలి యువకుడి మీద జాలి కూడా కలిగింది. అతడు యువకుణ్ణి సమీపించి అతడి తల మీది గాయాన్ని పరీక్షించాడు. అది ఏమంత పెద్ద గాయంలా కనిపించ లేదు. కొద్దిగా రక్తం మాత్రం కారుతున్నది.

"ఖడ్గా, ఈ అమాయకుణ్ణి నువ్వింత గట్టిగా కొట్టవలసింది కాదు. కాస్త బెదురు పెడితే సరిపోయేది! ముందు రక్తం కారకుండా ఆపాలి," అంటూ జీవదత్తుడు



మూలికల కోసం దాపుల నున్న చెట్ల కేసి నడిచాడు.

ఆ సమయంలో అక్కడికి పరిగెత్తు కొచ్చిన వసుమతి భార్య జీవదత్తుడి మాటలు విన్నది. ఆమె ఖడ్గవర్మ కేసి కొర కొర చూస్తూ, "నీ పరాక్రమం చూపేందుకు యీ అర్భకుడే దొరికాడా?" అన్నది.

"క్షమించవమ్మా! నీ తమ్ముడు అన్నిటా అర్భకుడే కావచ్చు. కాని అతడి చేతిలోని గండ్రగొడ్డలి చాలా పదునైనది. నే నాపక పోతే నా మిత్రుడేమయేవాడో నీ భర్తనే అడిగి చూడు," అన్నాడు ఖడ్గవర్మ.

వసుమతి భార్య తన భర్త కేసి కోపంగా చూసింది. అతడు యీసారి మరింత పెద్దగా నవ్వుతూ, "ఇందులో ఖడ్గవర్మ చేసిన అన్యాయం ఏమీ లేదు. అంతా నేను చూస్తూనే వున్నాను. ముందుగా హెచ్చరించే, ప్రయోజనం లేకపోగా, కత్తి పిడితో తల మీద కొట్టాడు," అన్నాడు.

"ఎందుకలా నవ్వుతావు? వాడు నీకు సహాయపడేందుకేగా ప్రయత్నం చేసింది? పాపం!" అన్నది వసుమతి భార్య.

ఆ మాటలు వసుమతికి కొంచెం కోపం తెప్పించినై. అతడు ముఖం కందగడ్డలా చేసుకుని, "ఇదంతా నా ఖర్మ. గంధర్వుణ్ణయిన నేను, నీ లాటి మానవస్త్రీని పెళ్లాడవలసి వచ్చింది. మరొక మానవ మాత్రుడి చేతిలో ఓడి నడుం విరక్కొట్టు కోవలసి వచ్చింది!" అన్నాడు.

ఆ సమయానికి జీవదత్తుడు రెండు దోసిళ్ళతో ఏవో ఆకులూ, కొన్ని వేళ్ళూ తీసుకుని అక్కడికి వచ్చాడు. వాటి నన్నిటినీ ఒక చోట గుట్టగా పోసి, వాటిల్లో నుంచి కొన్ని ఆకులను ప్రత్యేకంగా ఏరి తీసుకుని, అరచేతుల్లో నలిపి, ఉండగా చేసి, దానిని యువకుడి తల మీద గాయం అయినచోట అంటించాడు.

"అమ్మా, నీ తమ్ముడికొచ్చిన ప్రమాదం ఏమీ లేదు. గాయానికి కట్టు కట్టవలసిన అవసరం కూడా లేదు. గాయం నయం అయిన తరవాతే, నేను అంటించిన ఉప

ధులు రాలిపోతవి," అని జీవదత్తుడు వసుమతి కేసి తిరిగి, "వసుమతీ, నీ విరిగిన నడుముకిప్పుడే చికిత్స చేస్తాను. ఒక్క పావుగంటలో నీ మిట్టకోట భవనం మెట్లెక్కగలవు. అరవైనాలుగ్గంటల్లో తిరిగి వేటకు పోగలవు. విచారించకు," అన్నాడు.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తులు ఓషధీ ఆకులనూ, వేళ్లనూ చేతులతో బాగా మర్దించి అప్పుడు వచ్చిన రసాన్ని వసుమతి నడుముకు పూసి, దాని మీద ఆకుల పిప్పిని వేసి, కట్టు కట్టారు.

ఇదంతా ముగిసిన తరవాత వసుమతి ఖడ్గ జీవదత్తుల సాయంతో లేచి నిలబడి, "నా బావమరిది మాటేమిటి? అలా మాటా పలుకూ లేకుండా పడి వున్నాడు. ప్రాణాపాయం ఏమీ లేదు గదా? వాడికేమైనా జరిగిందంటే, వాడి అక్క చేతులో నాకు గండం వున్నట్టే!" అన్నాడు.

"ప్రాణాపాయం ఏమీ లేదు. దెబ్బకు దిమ్మెరపోయి సుఖంగా నిద్రపోతున్నాడు. కొద్ది సేపట్లో అతనూ లేచి మన వెనకగా భవనానికి వస్తాడు. తోడుగా అక్కగారున్నది గదా! ముందు మనం భవనానికి పోదాం," అన్నాడు జీవదత్తుడు.

వసుమతి కాస్త కుంటుతూ నాలుగడుగులు వేసి ఆగి, "జీవదత్తా, మీ యిద్దరిలో నువ్వు నాయకుడివిలా కనిపిస్తున్నావు. ఇంత



సేపూ ఖడ్గవర్మ మౌనం వహించాడేం? అతడికి నాలుకతో మాట్లాడటం కన్న కత్తితో మాట్లాడటంలో ఎక్కువ నేర్పున్నట్టున్నది," అన్నాడు.

"శత్రువుతో నేను మాట్లాడను. నా కత్తే మాట్లాడుతుంది. జీవదత్తుడిలో వున్న లౌక్యం, వ్యవహార జ్ఞానం నాకు అలవడ లేదు, ఏం చేసేది!" అన్నాడు ఖడ్గవర్మ కోపంగా.

"ఖడ్గా, అంత కటువుగా మాట్లాడకు. ఇప్పుడు వసుమతి మనకు శత్రువు కాదు, మిత్రుడు. యక్షుల ధాటికి తట్టుకోలేక అతని తలిదండ్రులు వింధ్యపర్వతాలు వదిలి యీ ప్రాంతాలకు వలస వచ్చారు.



మనం ఆ యక్షుల శక్తి సామర్థ్యాలు ఎలాంటివో చూసేందుకు అక్కడికి పోతున్నాం. అందువల్ల అతనూ మనమూ మిత్రులం," అన్నాడు జీవదత్తుడు.

ఈ మాటలు ఖడ్గవర్మనూ, వసుమతినీ కూడా ఆశ్చర్యపరిచినై. ఇద్దరూ కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకున్నారు. ఈ లోపల వాళ్ళు క్రమంగా భవనం మెట్లను సమీపించసాగారు. భవనం దిగువ మెట్టు దగ్గిర పడగానే వసుమతి దాని మీద ఒక కాలుంచి, తల తిప్పి జీవదత్తుడి కేసి గుచ్చి చూస్తూ, "జీవదత్తా! మీరు వింధ్యపర్వతాల కేసి పోతున్నారా? సరే, యక్షులంటున్నావేమిటి?" అని అడిగాడు.

"మేం యిద్దరం ఒక గొప్ప కార్యం సాధించి మహావీరులం అని రుజువు చేసుకునేందుకు వింధ్యపర్వతాలను దర్శించబోతున్నాం," అన్నాడు జీవదత్తుడు.

"జీవా, అది నిజమే! ఇందులో యక్షుల ప్రసక్తి ఏమున్నది? మనం కదిలించవలసింది రాతిరథం కాని, యక్షసంహారం కాదు గదా?" అన్నాడు ఖడ్గవర్మ.

రాతిరథం అన్న మాట వింటూనే వసుమతి పెద్దగా అదిరిపడి, "రాతిరథమా! వింధ్యపర్వతాల్లో వున్న రాతిరథాన్ని కదిలించేందుకు పోతున్నారా? ఆ సంగతి యిక్కడికి వస్తూనే నాతో అన్నట్టయితే, మన మధ్య యింత జగడమూ, అనవసర కాలయాపనా జరిగేది కాదు గదా?" అన్నాడు.

"అయిందేదో అయింది. ఇకనైనా కాలం వృథా కాకుండా చూద్దాం. త్వరగా మెట్లెక్కి నా విశ్రాంతి మందిరం చేరదాం. అక్కడ అంతా వివరంగా మాట్లాడుకోవచ్చు," అన్నాడు జీవదత్తుడు.

"అలా అయితే మనం పోవలసింది నా విశ్రాంతి మందిరానికి గాదు, ఆయుధాగారానికి. అది పేరుకు ఆయుధాగారం అయినా, అక్కడ నా పూర్వులు వదిలిపోయిన అపూర్వ వస్తువు లనేకం వున్నవి," అన్నాడు వసుమతి.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తుల సాయంతో అతడు మెట్లెక్కి, భవనంలోని ఒక పెద్ద గది ముందుకు పోయి ఆగాడు. ఆ గది తలుపులు గొళ్లెం పెట్టి వున్నాయి. వాటికి తాళం లాంటిది లేదు. తలుపుల మీద అనేక రకాల బొమ్మలు చెక్కబడి వున్నాయి. వసుమతి తలుపు గొళ్లెం తీసి, రెండు చేతులతో తలుపులను గట్టిగా పట్టుకుని వెనక్కు నెట్టాడు.



గదిలో కనిపించిన అపూర్వ వస్తుసంపద చూసి ఖడ్గ జీవదత్తులు అమితాశ్చర్యం చెందారు. గదిలో ఎక్కడ చూసినా మణి మాణిక్యాలు మిలమిలా మెరుస్తూ కనిపించాయి. గోడల పక్కగా అనేక రకాలైన ఆయుధాలు చేరవేయబడి వున్నాయి. గోడల కున్న కొయ్యమేకుల నుంచి వివిధ సంగీత వాయిద్యాలు వేలాడుతున్నాయి.

"ఇదంతా నా తండ్రి వదిలిపోయిన సంపద. తక్కిన లోకంతో సంబంధం లేకుండా, యీ కొండల మధ్య వేటాడి జీవించే నాకు, వీటితో అవసరం లేదు. సరే, అసలు సంగతి కొద్దాం. ఏదో రాతి రథం అన్నావే—దాని మాటేమిటి?'' అని అడిగాడు వసుమతి.

"అదంతా పెద్ద కథ, అయినా నాలుగు మాటల్లో ముఖ్య విషయం చెప్పేస్తాను. కాస్త విశ్రాంతిగా కూర్చోవటం బావుంటుంది గదా? ఈ తల్పాల మీద కూర్చోవచ్చా?'' అంటూ జీవదత్తుడు నగిషీపనితో అందంగా వున్న తల్పాన్నొకదాన్ని చూపించాడు.

"హాయిగా కూర్చునే మాట్లాడుకుందాం. నేను చెప్పవలసింది వుంది. కూర్చోండి!'' అంటూ వసుమతి, ఎదురుగా వున్న మరొక తల్పం మీద కూర్చున్నాడు.

జీవదత్తుడు తతిమ్మా సంఘటనలన్నీ వదిలి, పద్మపురరాజును తాము కలుసుకోవటం, ఆయన కుమార్తె పద్మావతి తమకు ఒక 'రాతిరథాన్ని చూపి, దాన్ని కదిలించిన వాడే మహావీరుడనీ, అతన్నే తాను వివాహం ఆడతాననీ అన్న మాటలూ మాత్రం చెప్పాడు.



"అంటే ఆ రాతిరథాన్ని మీరు చూశా రన్నమాట?" అన్నాడు వసుమతి ఎంతగానో ఆశ్చర్యపోతూ.

"అవును చూశాం; అది బొమ్మ రాతి రథం. వింధ్యపర్వతాల్లో ఎక్కడో వున్న రథానికి ప్రతికృతి అని చెప్పారు," అన్నాడు జీవదత్తుడు.

వసుమతి మారు మాటాడకుండా తల్పం మీంచి లేచి, గదిలో ఒక మూలగా వున్న ఒక పెద్ద కొయ్యపెట్టె మూత తెరిచి, అందులో నుంచి ఒక వస్తువును తీసుకుని ఖడ్గ జీవదత్తుల దగ్గిరకు వచ్చాడు. అది రాకుమారి పద్మావతి, ఖడ్గ జీవదత్తులకు చూపిన రాతిరథం లాగే వున్నది.

"ఇది నీ చేత ఎలా పడింది? కొద్ది వారాలకు ముందు దీన్ని మేం పద్మపుర రాజకుమార్తె దగ్గిర చూశాం గదా?" అన్నాడు జీవదత్తుడు ఆశ్చర్యంగా. ఖడ్గవర్మ రాతి రథం కేసీ, వసుమతి ముఖం కేసీ అను మానంగా చూడసాగాడు.

"దీన్ని నేనా రాజకుమారి నుంచి మాత్రం తస్కరించ లేదు. ఆ మధ్య ఒక వెన్నెల రాత్రి భవనం మీది అవరణలో నేను పడుకుని వుండగా, ఆ కాశంలో మేఘం లాగా కదులుతున్న ఒక నల్లని ఆకారం దీన్ని నా పక్కన పడవేసింది. ఇందులో అబద్ధం లేదు," అన్నాడు వసుమతి.

ఖడ్గవర్మ, జీవదత్తుడి కేసి తల తిప్పి, "ఇది నమ్మదగిందేనా? అదో కథ—విన్న కథ!" అన్నాడు.

"నేనూ యిదేదో కథగాని, భ్రమగాని అయి వుంటుందని, యీ రథానికట్టి వున్న చీటీ ఒక దాన్ని చదివి, ఆ పెట్టెలో పారవేశాను. నా భార్య యిదంతా ఆ రాత్రి నేను కొంచెం అతిగా సేవించిన మద్యపానం మహిమ కింద కొట్టిపారవేసింది. ఈ రథాన్ని నేనే తాగిన మత్తులో, ఈ గదిలో ఏ మూల నుంచో బయటికి తెచ్చానని ఆవిడ అభిప్రాయం," అంటూ నవ్వసాగాడు వసుమతి.

"ఆ చీటీలో ఏముంది? అదెక్కడ?" అని అడిగాడు జీవదత్తుడు ఆదుర్దాగా.

"ఆ చీటీ ఎప్పుడో గాలికి ఎగిరిపోయి వుంటుంది. దానిలో వున్న సంగతేమంటే; యిద్దరు క్షత్రియ యువకులు నా మిట్ట కోటకు వచ్చే అవకాశం వుందనీ, వచ్చి నప్పుడు తగిన సహాయం చేయమనీ," అన్నాడు వసుమతి.

"ఆహా, మనం చాలా సంగతులు మాట్లాడు కున్నాం. ఆ రాతిరథం రహస్యం వెనక మరింత నిగూఢమైన రహస్యం ఏదో వున్నది. వసుమతీ! నీ జాతివాడే ఒకడు మమ్మల్ని ప్రోత్సహించి ఆ రథం కదిలింపించాలని చూస్తున్నాడు. కారణం ఏమై వుంటుంది?" అంటూ జీవదత్తుడు కొంచెం ఆగి. "వసుమతీ! ఇక మేం బయలు దేరతాం!" అంటూ తల్పం మీదినుంచి లేచాడు. ఖడ్గవర్మ కూడా లేచి నిలబడ్డాడు.

"భోజనం చేసి బయలుదేరండి. నా భార్య ఆ ఏర్పాట్లు చేస్తున్నదనే అను కుంటాను," అన్నాడు వసుమతి.

తరవాత ముగ్గురూ గది నుంచి బయటికి వచ్చి, మెట్లకింద వున్న గదుల కేసి చూసే సరికి, అక్కడ వసుమతి భార్యా, బావమరిదీ హడావిడిగా వంట పనులు చేస్తూండటం కనిపించింది.

"జరిగిన దానికి పిల్ల వరకు రామన్న మమ్మల్ని క్షమిస్తాడని అనుకుంటాను!" అన్నాడు జీవదత్తుడు.



యువకుడు తల ఎత్తి చూసి నవ్వాడు. అతడి అక్క కూడా చిరునవ్వు నవ్వుతూ, "క్షమించటం ఏమిటి, నాయనా? ఆ దెబ్బతో వాడేదో పూర్వజన్మ జ్ఞానం కలిగినట్టు మాట్లాడుతున్నాడు. మీరు వాడికి మేన మామలట! చూశారా చిత్రం!" అన్నది.

"ఇందులో చిత్రం ఏమీ లేదు. నిజమే అయివుంటుంది! మేనల్లుణ్ణి ఖడ్గవర్మ అంత గట్టిగా కొట్టవలసింది కాదు!" అన్నాడు జీవదత్తుడు.

ఆ తరవాత అర గంటకు అందరూ భోజనాలు చేశారు. మిట్టకోట ప్రాంతాన్నుంచి బయటికి పోవాలంటే, అరణ్యంలో వున్న చెట్టుతెర్రలో వున్నదే మార్గమని వసుమతి.

ఖడ్గ జీవదత్తులకు చెప్పాడు. వారికి సహాయంగా తన బావమరిదిని వెళ్ళమన్నాడు.

ఖడ్గ జీవదత్తులు, వసుమతి దంపతులకు వీడ్కోలు చెప్పి బయలుదేరబోయే సమయంలో వసుమతి వాళ్ళకు తన ఆయుధాగారం నుంచి తెచ్చిన ఒక కంచుఢక్కను యిస్తూ, "ఇది చాలా ప్రభావం కలదని నా తండ్రి అంటూండేవాడు. కాని, ఉపయోగించవలసిన అవసరం నా కెన్నడూ కలగ లేదు. దీన్ని వాయిస్తే శత్రువులు గుండె బేజారై పారిపోతారు!" అన్నాడు.

"కంచుఢక్క ధ్వనికే గుండెలవిసి పారిపోయే శత్రువులు, ఏ పాటి శత్రువులు! ఇవ్వండి, అవసరం అయినప్పుడు ఉపయోగిస్తుందేమో చూస్తాం!" అని జీవదత్తుడు కంచుఢక్కను తీసుకున్నాడు.

తరవాత ఖడ్గ జీవదత్తులు, గండ్రగొడ్డలి యువకుణ్ణి వెంట బెట్టుకుని సొరంగ మార్గాన పాకుతూ పోయి, అరణ్యంలోని చెట్టు తొర్రను సమీపించారు. వాళ్ళకు బయట ఎవరో పెద్దగా మాట్లాడుకుంటూ వుండటం వినిపించింది. ఖడ్గవర్మ నిశ్శబ్దంగా ముందుకు పాకిపోయి చెట్టు తొర్రలో నుంచి బయటికి చూశాడు. తమకు పాత శత్రువైన మహేంద్రనగరం సేనాని కొడుకు, ముప్పై నలభైమంది సైనికులను చెట్టు కింద చేర్చి, పెద్దగా అజ్ఞాపిస్తున్నాడు.

"చూశారా, చెట్టు చుట్టూ ఎవరో పహరా తిరిగినట్టు గుండ్రని దారి ఏర్పడింది. ఒక్క గడ్డిపోచ మొలవలేదు. హంతకులైన ఆ ఖడ్గవర్మ, జీవదత్తుడూ యీ ప్రాంతానికి వచ్చినట్టు గ్రామస్థులు చెప్పగా మనం విన్నాం కదా! ఈ మహావృక్షం మీదే వాళ్లెక్కడో దాగి వుంటారు. మీలో యిద్దరు ముగ్గురు చెట్టెక్కి తొర్రలూ, కొమ్మలూ రెమ్మలూ—అన్నీ గాలించండి!" అన్నాడు సేనాని కొడుకు.

ఆ వెంటనే ఇద్దరు సైనికులు చెట్టు ఎక్కేందుకు బయలుదేరారు. ఖడ్గవర్మ వెనక్కు తిరిగి తన మిత్రులతో, "విన్నారు గదా!" అని కత్తి దూశాడు.

—(ఇంకా వుంది)





# కలలప్రభావం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ధైర్యసాహసాలూ, కార్యదీక్షా మెచ్చుకోదగినవి. వెనకటికి శూరజితు డనే రాజకుమారుడు ఎంతో గొప్ప వీరుడై ఉండి కూడా కలలను చూసి బెదిరిపోయాడు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు అతని విచిత్రమైన కథ చెబుతాను, విను." అంటూ ఇలా చెప్పసాగాడు.

సుధీరు డనే రాజా తన దేశాన్ని అదర్శ ప్రాయంగా పరిపాలిస్తూ, ఇతర వ్యసనాల జోలికిపోక, ప్రజాక్షేమం కోసమే అహో రాత్రులు పాటుపడేవాడు. ఆ సుధీరుడికి ఒక్కడే కొడుకు. అతని పేరు శూరజితుడు.

శూరజితుడు యుక్తవయసు వచ్చేసరికి అన్ని శస్త్రవిద్యలనూ అభ్యసించి గొప్ప

## బేతాళ కథలు



యోధుడుగా తయారయాడు. అతను చాలా పట్టుదలగలవాడు. రాజ్యభారం మీద పడితే తన తండ్రిని అన్నివిధాలా మించేటట్టుగా కనిపించాడు.

ఇలా ఉండగా ఒకనాడు శూరజితుడు అరణ్యానికి వేటకు వెళ్ళి, సాయంకాలం వరకూ వేటాడి ఇంటికి తిరిగి వచ్చి, అలిసి పోయి నిద్రపోయాడు. ఆ నిద్రలో అతనికి ఒక కల వచ్చింది.

ఆ కలలో అతను వేటాడుతూ తన పరివారాన్ని వదిలిపెట్టి చాలా దూరం వెళ్ళాడు. అలా పోయిపోయి అతను తన రాజ్యపు సరిహద్దు దాటి, పొరుగురాజ్యపు పొలిమేరలో ప్రవేశించాడు.

అతనికి దగ్గరలో కలకలం వినిపించింది. అతను అటుగా గుర్రాన్ని పోనిచ్చాడు. ఒక చోట నేల మీద మేనా ఉన్నది. కొందరు స్త్రీలు దాని సమీపంలో నిలబడి ఉన్నారు. మరొక పక్కగా కొందరు భటులు దొంగలతో హెూరాహెూరి పోరాడుతున్నారు.

అది చూడగానే శూరజితుడు కత్తి దూసి, దొంగల పైన కలియబడి, క్షణంలో వారిని పారదోలాడు.

అప్పుడు భటులు అతనితో, "అయ్యా, మీ రెవరో దేవుడిలాగా వచ్చి, మమ్మల్నీ, మా రాజకుమార్తె పుష్పావతీదేవినీ రక్షించారు. మీరు మా రాజుగారిని కలుసుకుంటే వారెంతో సంతోషిస్తారు." అన్నారు.

శూరజితుడు అందుకు సమ్మతించి, వారి వెంట రాజధానికి వెళ్ళాడు. రాజు శూరజితుణ్ణీ, అతని పరాక్రమాన్నీ ప్రశంసించి, అతను చేసిన సహాయానికి బహుమానంగా అతనికి పుష్పావతి నిచ్చి పెళ్ళి చేశాడు.

పెళ్ళి అయాక శూరజితుడు తన భార్యను చూసి ఆశ్చర్యపోయాడు. పుష్పావతి భూలోకరంభ. పువ్వు కన్న సుకుమారమైనది. అంత సుకుమారినీ, అందగత్తెనూ అతను ఎన్నడూ ఊహించను కూడా లేదు.

ఆ ఆశ్చర్యంలోనే శూరజితుడికి మెలకువ వచ్చింది. పుష్పావతి లేదు. అంతా



కల. తాను తన మందిరంలోనే ఉన్నాడు. అతను తన పెళ్ళి బాజాలనుకున్నవి కోటలో తెల్లవారు ఝామున వాయించే మంగళ వాద్యాలు

అతను కన్నది కలే అయినా అతని బుద్ధికి పుష్పావతి వాస్తవంగానే ఉన్నది. ఆమె ఏ పొరుగురాజ్యంలోనో ఉండే ఉంటుంది. ఏ విధంగానైనాసరే అతను ఆ పుష్పావతినే పెళ్ళాడాలని నిశ్చయించుకున్నాడు. అందుచేత అతను కాలకృత్యాలు తీర్చుకుని, తిన్నగా తన తండ్రి వద్దకు వెళ్ళి, తాను కలలో ఒక అపురూపసుందరిని చూశానని, ఆమెనే పెళ్ళి చేసుకుంటానని చెప్పాడు.

జ్ఞాని అయిన సుధీరుడు తన కొడుకుతో, "నాయనా, ఈ ప్రపంచంలో అందమూ, ఆనందమూ అన్నవి చాలా అశాశ్వతమైనవి. క్షత్రియుడికి ఉన్నది ఒకటే ధర్మం—ఆదర్శప్రాయంగా రాజ్యపాలన చేశాడన్న కీర్తి తెచ్చుకోవటం. అలాటి కీర్తి అందరికీ సాధ్యమయేది కాదు," అన్నాడు.

"అలా కాదు, నాన్నగారూ. ఈ పుష్పావతిని నేను మరవటం సాధ్యంకాదు. ఆమె జ్ఞాపకం ఉండగా మరొకతెను పెళ్ళి చేసుకుని, ఆమెతో సంసారం చేయలేను," అన్నాడు శూరజితుడు.

తన కొడుకు పట్టుదల ఎలాటిదో తెలుసును గనక రాజుగారు, "నీకు నచ్చిన కన్యనే వివాహమాడు. ఆమె కోసం ఎంత కాలం పాటు, ఎన్ని దేశాలు తిరగవలిసి ఉంటుందో చెప్పలేం. అందుచేత నీ ప్రయాణానికి కావలసినవన్నీ తీసుకుని బయలు దేరు," అన్నాడు.

శూరజితుడు కొన్ని ఆయుధాలు తీసుకుని, గుర్రం ఎక్కి రోజల్లా ప్రయాణం చేసి, ఒక నగరం చేరి, అక్కడ పేదరాసి పెద్దమ్మ ఇంట బస చేశాడు. పెద్దమ్మ అతనికి వేడినీళ్ళ స్నానమూ, మంచి భోజనమూ ఏర్పాటు చేసింది. రోజల్లా ప్రయాణం చేసిన బడలికవల్ల అతను నడుము వాల్చుతూనే సుఖనిద్రలో పడ్డాడు. ఆ నిద్రలో తిరిగి కల వచ్చింది.



ఆ కలలో అతను పుష్పవతితో పాటు కొద్ది రోజులు మామగారి ఇంట ఉండి, తన దేశానికి తిరిగివచ్చాడు. అతను తిరిగివచ్చే లోపునే అతని తండ్రి చనిపోయాడు. నగరమంతా శోకసముద్రంలో మునిగి ఉన్నది. శూరజితుడు తండ్రికి ఉత్తరక్రియలు చేసి, రాజ్యాభిషేకం చేయించుకున్నాడు.

రాజయిన కొత్తలో అతను రాచకార్యాలను కొద్దిగా నిర్వర్తించాడుగాని, క్రమంగా వాటి మీద అతనికి విముఖత్వం కలిగింది. అతని మనసంతా పుష్పవతితో నిండిపోయింది. ఆమెకు క్షణంపాటు దూరం కావటం కూడా అతనికి ఎంతో బాధగా ఉన్నది. అందుచేత అతను రాజరికపు బాధ్యతలన్నీ క్రమంగా మంత్రుల మీదికే నెట్టి, తాను అహోరాత్రాలు అంతఃపురంలో తన భార్యతోనే గడపసాగాడు.

రాజ్యపాలన రాజుకు పట్టకపోయేసరికి మంత్రులు తమ ఇష్టంవచ్చినట్టు నిరంకుశంగా ప్రవర్తించసాగారు. దేశంలో అరాజకం తల ఎత్తింది. ఆ సంగతి గ్రహించి పుష్పవతి తన భర్తను చాలా సార్లు హెచ్చరించింది.

కాని శూరజితుడు ఆమె భయాన్ని లక్ష్యపెట్టక, "మంత్రులు సమర్థులు. వారు మా నాన్నకాలం నుంచీ ఉన్నవారే. నా కన్న పరిపాలన వారికే బాగా తెలుసు," అన్నాడు.

రాజ్యంలో అధికారుల అవినీతి బాగా పెరిగిపోయింది. ప్రజలు రాజును శాపనార్థాలు పెట్టసాగారు. దేశంలో దోపిడీలూ, హత్యలూ పెచ్చు పెరిగిపోయాయి. శత్రురాజులు ఇదే సమయమనుకుని దేశం మీదికి వచ్చారు.

పుష్పవతి ఇక సహించలేక తన భర్త దగ్గిరికివచ్చి, "నువ్వు ఇలాటివాడివని తెలిస్తే పెళ్ళి చేసుకోకపోదును. నీ అంత అప్రయోజకుడు లేడు. ఖజానా ఖాళీ అయింది. నీ అధికారులు నిన్ను దోచుకున్నారు. ఇప్పుడు నీ దేశాన్ని కొల్లగొట్టటానికి శత్రువులు కూడా వచ్చారు. నీ రాజ్యంలో ఇంత

సంక్షోభం జరుగుతూంటే నువ్వు ఆడదాని లాగా అంతఃపురంలో కూర్చున్నావు." అని నిందించింది.

శూరజితుడు మండిపడి, కత్తి దూసి పుష్పావతి తల నరికేశాడు. ఇదే సమయంలో శత్రుసైనికులు కోటలో ప్రవేశించారు. శూరజితుడు పారిపోబోయాడుగాని, శత్రువులు అతన్ని చుట్టుముట్టి చంపేశారు.

శూరజితుడు కంగారుగా నిద్రలేచాడు. అంతా కలే. తాను పేదరాసి పెద్దమ్మ ఇంటనే ఉన్నాడు.

అతను తెల్లవారగానే తిరుగు ప్రయాణమై ఇంటికి తిరిగివచ్చి, తండ్రి కుదిర్చిన కన్యను వివాహమాడి, తండ్రి జీవించి ఉండగానే రాజ్యపాలన అంతా క్షుణ్ణంగా నేర్చుకుని, తండ్రి అనంతరం చక్కగా రాజ్యపాలన చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, శూరజితుడు పుష్పావతి కోసం వెతకటం ఎందుకు మానేశాడు? తనకు వచ్చిన కలలోలాగే జరుగుతుందని భయపడ్డాడా? లేక పుష్పావతి పైన కలిగిన వ్యామోహం నశించిందా? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శూరజితుడు కల మూలంగానే సౌందర్య వ్యామోహంలో పడ్డాడు. సౌందర్యం వల్ల కలిగే ఆనందమూ, కీడూ కూడా కలలోనే అనుభవించాడు. ఇక పుష్పావతి లభ్యమయినా ఆమె నుంచి పొందగల ఆనందం ఏదీ లేదు. అతను కలలను గురించి భయపడ్డాడనుకోవటానికి కారణం లేదు. అతను పుష్పావతి కోసం వెదకటం మానుకోవటానికి ముఖ్యకారణం అతని తండ్రి మొదట్లో చెప్పిన హితవే. అప్పటికే అతను పుష్పావతిని కలగని ఉండకపోతే తండ్రి చెప్పినట్టే చేసేవాడు. కలల ప్రభావం అయిపోగానే ఆ పనే చేశాడు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# సజ్జనుడి పాట్లు

బొగ్దాదునగరంలో ఖలీఫాగా ఉండిన హారూనల్ రషీద్‌కు ఒక రాత్రి నిద్ర పట్టక తన అంగరక్షకుడైన మన్‌సూర్‌ను పిలిచి, "వజీరు జఫర్‌ను పిలుచుకురా. అతనే మైనా కాలక్షేపం చేసి ఉపాయం చెబుతా డేమో!" అన్నాడు.

మన్‌సూర్ వెళ్ళి జఫర్‌ను పిలుచుకు వచ్చాడు. జఫర్ ఆందోళనగా, "తమరి ఆరోగ్యం చెడలేదుగద!" అన్నాడు.

"నా ఆరోగ్యం సరిగానే ఉన్నది గాని మనస్సు వికలమై ఉంది. నిద్ర పట్టటం లేదు. మనస్సుకు ఏదైనా వ్యాపకం కావాలి," అన్నాడు ఖలీఫా.

"మన పుస్తకభాండారంలో రకరకాల గ్రంథాలున్నాయి. వాటితో తమకు ఉల్లాసం కలగవచ్చునేమో," అన్నాడు జఫర్.

"బాగా చెప్పావు. అక్కడికే పోదాం," అన్నాడు ఖలీఫా.

మన్‌సూర్ ఒక దివిటీ, జఫర్ ఒక దివిటీ పట్టుకుని దారి చూపుతూ, ఖలీఫాను రాజభవనంలోని పుస్తక భాండారానికి తీసుకు వెళ్ళారు. అక్కడ ఖలీఫా అనేక పుస్తకాలు తీసి చూసి పెట్టేసి, చివరకు ఒక అతి ప్రాచీన గ్రంథం తీసి, దాన్ని శ్రద్ధగా చదవసాగాడు. చదువుతూ చదువుతూ ఆయన విరగబడి నవ్వాడు. అయినా ఆయన చదవటం మానక, మరి కొంత సేపటికి కన్నీరు కార్చసాగాడు. చివరకు ఆయన ఆ పుస్తకాన్ని మూసివేసి చేత పట్టుకుని పడుకునేటందుకు తన గది కేసి బయలుదేరాడు.

ఖలీఫా నవ్వటమూ, ఏడవటమూ చూసిన జఫర్ ఉండబట్టలేక, "ప్రభూ, తమరు ఎందుకు నవ్వారు, వెంటనే ఎందుకు కంట తడి పెట్టుకున్నారు?" అని అడిగాడు.



ఈ ప్రశ్న విని ఖలీఫా మండిపడి, "హమదా, నీకా అరాలన్నీ దేనికి? ప్రతిదీ నీకు కావాలా? అడిగావు గనక, నేను ఎందుకు నవ్వానో, ఎందుకు ఏడ్చానో, ఈ పుస్తకంలో మొదటి నుంచి చివరదాకా ఏమున్నదో తెలిసినవాణ్ణి వెంటనే తీసుకురా! తీసుకు రాలేకపోతే నీ తల తీసేయిస్తాను. అనవసర జోక్యాలు పెట్టుకున్నందుకు నీకు అదే శిక్ష," అన్నాడు.

"మహాప్రభూ, నా వల్ల అపరాధం జరిగింది. నా లాటి అల్పులు అపచారాలు చెయ్యటమూ, తమవంటి వారు వాటిని క్షమించటమూ కూడా సహజమే," అన్నాడు జఫర్.

"అదేమీ కుదరదు. నిన్ను క్షమించటానికి వీల్లేదు. మాట అనేశాను. నేను కోరిన మనిషిని తెస్తావో, తల తీసేయించుకుంటావో తేల్చుకో," అన్నాడు ఖలీఫా.

"తమరు కోరిన మనిషిని తీసుకు రావటానికి కనీసం మూడు రోజులైనా వ్యవధి ఇవ్వండి," అన్నాడు జఫర్.

"సరే, మూడు రోజులు వ్యవధి ఇస్తాను," అన్నాడు ఖలీఫా.

జఫర్ ఖలీఫా వద్ద సెలవు పుచ్చుకుని, వెంటనే ఇంటికి తిరిగి వచ్చాడు. ఆయన జరిగినదంతా తన తండ్రికీ, తమ్ముడికీ తెలిపి, "ఖలీఫా నా పాలిటి మృత్యువుగా తయారయాడు. పలాయనం తప్ప నాకు మరో దారి లేదు. దూర దేశం పోయి బతుకుతాను," అన్నాడు.

"అయితే నువు డమాస్కస్ నగరంలో కొంతకాలం ఉండి, అక్కడ పరిస్థితి మెరుగు పడ్డాక తిరిగి రా," అని జఫర్ తండ్రి యహ్యా సలహా ఇచ్చాడు.

జఫర్ వెయ్యి దీనారాలు వెంట తీసుకుని, నడుముకు ఖడ్గం బిగించి, కంచర గాడిద నెక్కి, ఎడారి మార్గాన సూటిగా బయలుదేరాడు. ఆయన పది రోజులు ప్రయాణం చేసి డమాస్కస్ నగరం చేరుకున్నాడు. ఊరి బయట కంచరగాడిద మీది నుంచి దిగి, దాన్ని నడిపించుకుంటూ

వీధుల వెంబడి ఇళ్ళూ, మసీదులూ చూసు
కుంటూ వస్తూండగా ఆయనకు ఒక పెద్ద
భవంతి, దాని చుట్టూ తోటా, ఆ తోటలో
ఒక పట్టు డేరా కనిపించాయి. డేరాలో
మంచి మంచి తివాసీలూ, సిల్కు, జరీ
సులూ, మెత్తలూ ఉన్నాయి. డేరా మధ్య
పూర్ణచంద్రుడి లాటి యువకుడు ఒకడు
గులాబీరంగు దుస్తులు ధరించి కూర్చుని
ఉన్నాడు. అతని ఎదురుగా కొందరు అతి
థులు కూర్చుని పానీయాలు సేవిస్తున్నారు.
యువకుడి సరసన ఒక స్త్రీ కిన్నెర మీద
వాయిస్తూ, మనోహరంగా పాడుతున్నది.

జఫర్ ఈ దృశ్యాన్ని కనులపండుగగా
చూస్తూ, సంగీతాన్ని ముగ్ధుడై వింటూ
అలాగే నిలబడిపోయాడు. డేరాలో ఉన్న
యువకుడు ఆయనను చూడగానే లేచి నిటా
రుగా కూర్చుని, ఒక బానిస కుర్రవాణ్ణి
పిలిచి, "వెంటనే వెళ్ళి, ఆ పెద్దమనిషిని
ఆహ్వానించు. దూర ప్రయాణీకుడిలా
గున్నాడు," అన్నాడు.

బానిస కుర్రవాడు జఫర్ దగ్గిరికి పరి
గెత్తుకుంటూ వెళ్ళి తమ యజమాని
రమ్మంటున్నారని చెప్పాడు. జఫర్ తన
కంచరగాడిదను ఆ కుర్రవాడికి అప్పగించి,
డేరా వద్దకు వెళ్ళాడు. ఆయనను చూస్తూనే
యువకుడు లేచి నిలబడి, "అల్లా అను
గ్రహం వల్ల మీరు వచ్చారు. దయచేసి
కూర్చోండి," అన్నాడు.

ఆ యువకుడు చూపిన ఆదరమూ,
చేసిన ఆతిథ్యమూ జఫర్‌కు ఎంతో



ఆనందం కలిగించాయి. అయినప్పటికీ జఫర్‌ను పట్టి వేధిస్తున్న గుండెబరువును అతను పసిగట్టి, "ఎలాంటి విచారమూ పెట్టుకోకండి. సంగీతం వింటూ, సరదాగా కబుర్లు చెప్పుకుంటూ ఉల్లాసంగా కాలం గడుపుదాం," అన్నాడు.

జఫర్ పానీయాలు తాగి సేద తీరిన అనంతరం ఆ యువకుడు రెండు గుర్రాలు తెప్పించాడు. వాటి మీద వారిద్దరూ డమాస్కస్ వీధుల వెంట కొంతసేపు తిరిగి, దుకాణాలు చూసి, చివరకు ఒక దివ్యమైన భవనం వద్దకు వచ్చారు. ఆ ఇంటి ముందు రంగురంగుల లాంతర్లున్నాయి. లోపల ఒక పెద్ద హాలూ, శిల్పాలూ, రకరకాల పక్షులూ, పూలజాతులూ ఉన్నాయి.

ఇద్దరూ లోపల కూర్చున్నాక ఆ యువకుడు జఫర్‌తో, "ఇవాళ మీ రాక మాకు పర్వమయింది. మీరు సకుటుంబంగా వచ్చి ఉంటే ఇంకా ఎంతో బాగుండేది. ఇంతకూ మీరు మా నగరాన్ని ఎందుకు పావనం చేశారో నేను తెలుసుకోలేదు," అన్నాడు.

"అయ్యా, నేను సైనిక వృత్తిలో ఉన్నవాణ్ణి. చిన్న దళానికి సర్దారును. ఖలీఫాకు సుంకం చెల్లించుకోలేక, ప్రాణాలు అర చేత పట్టుకుని బస్రా నుంచి పారిపోయి వచ్చాను," అన్నాడు జఫర్.



"మరి మీ పేరు?" అని అడిగాడు యువకుడు.

"నీ పేరే నా పేరు కూడాను!" అన్నాడు జఫర్.

"అయితే మీ పేరు అబూ అల్‌హసన్ అన్నమాట!" అని హాస్యానికి అని, "మీరు జరిగినది మరిచిపోయి, సుఖంగా ఉండండి," అన్నాడు యువకుడు.

ఇద్దరూ భోజనాలు చేసినాక, ఆ యువకుడు జఫర్‌కు మంచి దుస్తులు ఇప్పించి, ముందు పాడిన యువతి చేతనే తిరిగి గానం చేయించాడు. ఆ యువకుడి పేరు అత్రఫ. అతను చేసే అతిథిసత్కారం జఫర్‌కు అపూర్వంగా తోచింది.

రాత్రి పొద్దుపోయాక బానిసనోకర్లు జఫర్‌కు పక్క వేస్తూ, అత్రఫ్‌కు కూడా వేశారు. అది చూసి, జఫర్, "బాబూ, నీకు పెళ్ళి కాలేదా?" అని అడిగాడు.

"అయింది," అన్నాడు అత్రఫ్.

"అయితే అంతఃపురంలో పడుకోక ఇక్కడ ఎందుకు పడుకుంటున్నావు?" అని జఫర్ అడిగాడు.

"అంతఃపురం ఎక్కడికీ పోదు. అతిథిని ఒంటరిగా పడుకోనివ్వటం చాలా అమర్యాద," అన్నాడు అత్రఫ్. తాను తన నగరానికి వెళ్ళిపోయిన దాకా అత్రఫ్ తనకు తోడు పడుకుంటానని చెప్పేసరికి జఫర్ ఆశ్చర్యపోయి, "ఎంత చిత్రమైన మనిషి!" అనుకుంటూ నిద్రపోయాడు.

మర్నాడు ఉదయం ఇద్దరూ స్నానశాలకు వెళ్ళి, శుభ్రంగా స్నానంచేసి, మేలి దుస్తులు ధరించి, గుర్రాల మీద పుణ్య ప్రదేశాలు చూడబోయారు.

ఇలాగే నాలుగు మాసాలు గడిచింది.

ఒకనాడు జఫర్ అత్రఫ్‌తో, తనకు కాలి నడకన ఒంటరిగా మసీదులన్నీ సందర్శించాలని ఉన్నట్టు చెప్పాడు. అత్రఫ్ అందుకు అభ్యంతరం చెప్పక, దానధర్మాలు చెయ్యటానికి మూడువందల దీనారాలు సంచిలో పోసి, జఫర్‌కు ఇచ్చాడు. అది తీసుకుని జఫర్ ఇంటి నుంచి బయలుదేరాడు.

ఖలీఫా తనకు కలిగించిన సమస్యను గురించి విచారపడుతూ జఫర్ ఒక బ్రహ్మాండమైన మసీదుకు చేరుకుని, దానికి



గల మసీదు పాలరాతి మెట్లూ ఎక్కాడు. ఆ మసీదులోని అద్భుత శిల్పం ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. అక్కడ ప్రార్థన చేసి, అక్కడి నుంచి నింపాదిగా నడుచు కుంటూ జఫర్ ఒక రాజభవనం లాటి ఇంటి వద్దకు చేరుకున్నాడు.

ఆ ఇంటి ముందుభాగాన అలంకారార్థం అమర్చిన రంగు రంగుల పింగాణీ పల కలూ, వెండి కిటికీ తలుపులూ, బంగారు చత్రాలూ, కిటికీలకు అమర్చిన పట్టు తెరలూ చూస్తూంటే జఫర్‌కు పరమానంద మయింది. ఇంటి ముందున్న చలవరాతి అరుగు మీద కూర్చుని విశ్రాంతి తీసు కుంటూ ఆయన ఇంటి అందం చూడ సాగాడు. ఇంతలో ఒక కిటికీ పరదా పక్కకు తొలగింది. ఒక తెల్లని చెయ్యి బంగారు పాత్రతో కిటికీ కింద నున్న పూల తొట్లలో నీరు పోయసాగింది. ఆ మనిషి ముఖం చంద్రబింబం లాగుంది. జఫర్ మనసును అమితంగా ఆకర్షించింది. వెంటనే జఫర్‌ను మోహం ఆవేశించింది.



ఆమె తొట్లలో నీరు పోయటం పూర్తి చేసి వీధిలోకి చూసి, జఫర్ తననే చూస్తూ ఉండటం గమనించి, " ఈ ఇల్లు మీదా? " అని అడిగింది.

" కాదు. కాని ఈ బానిస నీవాడు! " అన్నాడు జఫర్ పారవశ్యంతో.

" ఇది మీ ఇల్లు కానప్పుడు నీ దారిన నువ్వు పోరాదూ? " అన్నదామె.

" చిన్న కవిత చెబుదామని ఆగాను, " అంటూ జఫర్ రెండు ప్రణయ గీతాలు అల్లి చదివాడు. అది విని ఆమె కిటికీ మూసి అంతర్ధానమయింది. ఆ కిటికీ మళ్ళీ తెరుచుకుంటుందన్న ఆశతో జఫర్ చాలా సేపు చూశాడు. కాని ఆ ఆశ ఫలించలేదు. సాయంకాలం దాకా చూసి ఆయన అత్రఫ్ ఇంటికి తిరిగి వెళ్ళాడు.

తన అతిథి కోసం సింహద్వారం వద్ద ఎదురు చూస్తున్న అత్రఫ్ జఫర్‌ను కౌగ లించుకుని, " రోజంతా నన్ను విచారంలో ముంచారు, " అన్నాడు. కాని జఫర్,

మతిలో మతి లేనివాడిలాగా, దానికేమీ సమాధానం చెప్పలేదు.

అత్తఫ్ ఆయన ముఖంలోకి చూసి, "మీరేదో విచారంలో ఉన్నట్టు కనిపిస్తుంది?" అని అడిగాడు.

"నాకు ఒంట్లో అంత బాగాలేదు," అన్నాడు జఫర్.

భోజనానికి కూర్చుని జఫర్ భోజనాన్ని చేత్తో తాకనైనా లేదు. అతను ఖలీఫా ఆగ్రహాన్ని కూడా పూర్తిగా మరిచిపోయినాడు. అతని మనసులో ఆ స్త్రీ ముఖం తప్ప ఇంకేమీ లేదు. విరహవేదనతో అతను ఆ రాత్రి నిద్ర కూడా పోక, జ్వరంతో బాధ పడుతున్న వాడిలాగా అయాడు.

అత్తఫ్ తెల్లవారి నిద్ర లేస్తూనే జఫర్‌ను, "ఎలా ఉన్నారు?" అని అడిగాడు.

"నాకు ఏమీ బాగాలేదు, తమ్ముడా! నాకు జీవించాలన్న కోరిక పోయింది," అన్నాడు జఫర్.

ఈ మాట విని అత్తఫ్ చాలా బాధ పడ్డాడు. అతను ఒక నౌకరును పంపి నగరంలో కల్లా గొప్ప వైద్యుణ్ణి పిలిపించాడు. వైద్యుడు వచ్చి జఫర్ నాడి చూస్తూనే విషయం ఏమిటో గ్రహించాడు. జఫర్ శరీరంలో ఏ రోగమూ లేదు; ఉన్నదంతా మనస్సులోనే ఉన్నది. ఆయన ఒక చీటీ మీద "ప్రేమ జ్వరము" అని రాసి, ఆ చీటీని జఫర్ తలగడ కింద పెట్టి వెళ్ళిపోయాడు.

అత్తఫ్ ఆ చీటీ తీసి చూసి విరగబడి నవ్వి, "మీకు ఈ వ్యాధి కలిగించినవారు ఎవరు?" అని అడిగాడు. జఫర్ చాలాసేపు చెప్పలేదు, కాని అత్తఫ్ ఒత్తిడి చేసిన మీదట జరిగినది చెప్పేశాడు.

అత్తఫ్ తల వంచుకుని దీర్ఘాలోచనలో పడ్డాడు. తన అతిథి ప్రేమించిన స్త్రీ మరెవరో కాదు—తన భార్యే. ఆమె తన పుట్టింటనే ఉంటున్నది. జఫర్ ఆ ఇంటిని స్పష్టంగా వర్ణించాడు. ఇది తనకు భగవంతుడు పెట్టిన పరీక్ష లాగా అతనికి తోచింది. స్నేహంలో స్వార్థానికి తావు లేదని అతని అభిప్రాయం. —(ఇంకా వుంది)





# త్రిలోకసుందరి

పూర్వం ఒక రాజుకు ముగ్గురు కుమార్తెలుండేవారు. పెద్ద కుమార్తెలిద్దరూ సాధారణమైన సౌందర్యం గలవారు. కాని మూడో కుమార్తె అద్భుత సౌందర్యవతి. ఆమెను చూసినవారంతా ఆమెను త్రిలోకసుందరి అనేవారు. ఆమెకు అదే పేరయిపోయింది.

త్రిలోకసుందరికి ఏ రాజాధిరాజో భర్త అవుతాడని ఆమె తల్లిదండ్రులు అనుకున్నారు. కాని అలా జరగలేదు. ఆమె అక్కలిద్దరినీ పెళ్ళాడతామని వచ్చినవారున్నారుగాని, త్రిలోకసుందరిని పెళ్ళాడగోరి ఒక్కడూ రాలేదు. అక్కల పెళ్ళిళ్ళు అయి, కాపరాలకు వెళ్ళినాక కూడా త్రిలోకసుందరికి సంబంధం రాలేదు.

అది చూసి రాజు విస్మయం చెంది, ఆమె భవిష్యత్తు గురించి దైవజ్ఞులను అడిగాడు. వాళ్ళు ఆమె జాతకం పరీక్షించి, "మహారాజా, ఈమెకు కులీనుడైన రాజెవరూ పెళ్ళాడే యోగం లేదు. ఈమె జీవితం కొండలలోనూ, అరణ్యాలలోనూ గడుస్తుంది. ఈమె దుర్భరమైన కష్టాలు అనుభవిస్తుంది. నీచులూ, పశుప్రాయులూ అయినవాళ్ళు ఈమె కష్టాలన్నిటికీ కారకులవుతారు," అని దాచకుండా చెప్పారు.

ఎన్నడూ ఎలాటి కష్టాలూ ఎరగని రాజూ, రాణీ తమ కుమార్తెను గురించి ఎంతగానో దుఃఖించారు. దైవజ్ఞులు చెప్పిన మాటలలో విశ్వాసం ఉండటంచేత వారు త్రిలోకసుందరిని ఒకనాడు తీసుకుపోయి నిర్మానుష్యమైన కొండప్రాంతంలో విడిచి, "తల్లీ, నీకు భర్తగా ఏ పశుప్రాయుడు రాసిపెట్టి ఉన్నాడో వాడికి భార్యవై, పడవలసిన కష్టాలన్నీ పడి, జీవితం వెళ్ళబుచ్చు," అని హెచ్చరించి తమ ఇంటికి తిరిగివచ్చారు.

త్రిలోకసుందరి స్థితి ఇలా ఉంటే గంధర్వలోకంలో ఈమె కారణంగా కొంత

వి. నాగభూషణరావు



సంచలనం కలిగింది. త్రిలోకసుందరి అనే బిరుదు గల గంధర్వ రాణి ఒకతె ఉన్నది. దేవతలలో అన్ని తెగలవారూ, ఆమెను మించిన సౌందర్యవతి మూడు లోకాలలోనూ లేదని అంగీకరించారు. ఆమెకు నవమన్మథు డని ఒక కొడుకు ఉండేవాడు. దేవగణాలలో వాడివంటి అందగాడు కూడా మరొకడు లేడు.

మామూలు మనుషులలో త్రిలోకసుందరి అని ఒక పిల్ల ప్రసిద్ధికెక్కటం గంధర్వ రాణి విన్నది. ఆ పిల్ల అందాన్ని గురించి తెలుసుకు రమ్మని ఆమె అనేక మంది గంధర్వులను పంపింది. వారు త్రిలోకసుందరిని చూసివచ్చి, "దేవీ, ఆ మనుష్య కన్య సౌందర్యం నీ సౌందర్యానికి ఎంత మాత్రమూ తీసిపోదు. నీ కన్న వయసులో చిన్నది గనక ఈ కాలానికి త్రిలోకసుందరి అన్న బిరుదు ఆమెకే చెల్లుతుంది." అని చెప్పారు.

గంధర్వరాణికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆమె తన కొడుకైన నవమన్మథుణ్ణి పిలిచి, "నాయనా, నీ విద్యలన్నీ ఉపయోగించి ఈ త్రిలోకసుందరి మదం అణచాలి. ఆమెకు అతి నికృష్టుడి మీద వ్యామోహం కలిగేటట్టు చేసిరా," అని పంపింది.

కాని నవమన్మథుడు తల్లి చెప్పినట్టు చెయ్యలేదు. అతను అదృశ్యంగా వచ్చి, కొండ మీద ఉన్న త్రిలోకసుందరిని చూసి, ఆమె అందానికి అద్భుతపడి, ఆమెను ప్రేమించాడు. అతను కొండ దిగువన ఉన్న లోయలో ఒక అద్భుతమైన భవనం నిర్మించి, అందులో తన సేవకులను ఏర్పాటు చేశాడు. తరవాత అతను వాయుదేవుణ్ణి పిలిచి, త్రిలోకసుందరిని లోయలోకి దించమన్నాడు.

త్రిలోకసుందరికి మొదట్లో తనను ఎవరో లోయలోకి తోసేస్తున్నారనీ, అంత లోతుకు పడిపోయి చచ్చిపోతాననీ భయం కలిగింది. కాని ఆమె ఏ మాత్రమూ దెబ్బ తగలకుండా, ఎవరో దించినట్టు, లోయలోకి

సుఖంగా దిగి, ఆ నిర్జనప్రదేశంలో అంత అద్భుతమైన భవనం ఉండటం చిత్ర మనుకున్నది.

ఆ భవనాన్ని చూస్తున్నకొద్దీ ఆమెకు అందులోకి వెళ్ళి చూడాలనిపించింది. ధైర్యం చేసి ఆమె లోపలికి వెళ్ళి చూస్తే, ఆ ఇంట ఎవరో గొప్పవాళ్ళు నివసిస్తున్నట్టు తోచింది. కాని ఎక్కడా మనిషిజాడ కనిపించలేదు. అయినా ఎవరో మసలుతున్నట్టూ, మాట్లాడు తున్నట్టూ వినిపించింది.

అదృశ్యవ్యక్తులు ఆమె కోసం భోజనం వడ్డించారు. పాటలు పాడారు. ఆమె నిశ్చిం తగా భోజనంచేసి, చీకటిపడుతూ ఉండటం చేత వెళ్ళి పడుకున్నది.

ఈ ఏర్పాట్లన్నీ త్రిలోకసుందరి కోసం నవమన్మథుడే చేశాడు. గాఢాంధకారంలో అతను ఆమె వద్దకు వచ్చి, గాంధర్వ విధిలో ఆమెను తన భార్యగా చేసుకుని, తెల్లవారక ముందే వెళ్ళిపోయాడు. అటుతర్వాత రోజూ ఇలాగే జరుగుతూ వచ్చింది. ఆమెకు తన భర్త ఎలా ఉంటాడో తెలియదు; తనకు పరిచర్యలు చేసే దెవరో తెలియదు. కాని ఆమెకు జీవితం చాలా ఆనందంగానే గడు స్తున్నది.

ఈ లోపల త్రిలోకసుందరి కోసం ఆమె తల్లిదండ్రులు మహా ఏడిచారు. తమ చెల్లెలు అడవులపాలై ఉండని విని ఆమె అక్కలు



కేకలు పెడుతూ పుట్టింటికి వచ్చి, తల్లి దండ్రులను ఓదార్చారు.

ఆ రాత్రి నవమన్మథుడు త్రిలోకసుంద రితో, "ప్రేయసీ, నీకు గొప్ప ప్రమాదం రానున్నది. నీ కోసం నీ అక్కలు ఆ కొండ మీదికి వస్తారు. కేకలు పెడతారు. నువు వారి కేసి చూడకు. వారి కేకలు వినకు. అలా అయితేనే నీకు క్షేమం." అని హెచ్చ రించాడు.

త్రిలోకసుందరి సరే నన్నది. కాని ఆ రాత్రి గడిచి, అతను వెళ్ళిపోయి, తెల్లవారి నాక ఆమెకు దుఃఖం ముంచుకు వచ్చింది. ఆమె ఇన్నాళ్ళూ ఒంటరి జీవితమే గడుపు తున్నది. ఆమె తోటి మానవులను చూసి

ఎంతో కాలమయింది. ఇంత కాలానికి తన అక్కలు తన కోసం ఏడుస్తూ రాబోతున్నా రట! వారిని ఓదార్చి, వాళ్ళతో మాట్లాడి, తన క్షేమసమాచారమన్నా చెప్పుకోవటానికి లేదా? ఐతే ఉన్నన్నాళ్ళూ తాను ఇలా ఖైదీగా ఉండవలసిందేనా?

ఇలా అనుకుంటూ ఆమె ఆ రోజల్లా స్నానం చెయ్యలేదు, భోజనం చెయ్యలేదు. ఆ రాత్రి నవమన్మథుడు వచ్చేసరికి ఆమె ఘోరమైన దుఃఖంతో కుమిలిపోతున్నది.

"సుందరీ, ఎందుకు నీ కీ విచారం? ఇలా ఏడుస్తూ నాతో సుఖంగా ఎలా కాపరం చేస్తావు? పోనీ, నీ ఇష్టం వచ్చినట్టే చెయ్యి. కాని తరవాత నువ్వు పశ్చాత్తాప పడి, నేను చెప్పినది నిజమని గుర్తిస్తావు!" అన్నాడు.

తన అక్కలు తనను గురించి ఏడుస్తూ వచ్చినట్టయితే వారిని ఓదార్చి, వారితో ముచ్చట్లు చెప్పుకోవటానికి అనుమతి ఇవ్వమని త్రిలోకసుందరి తన భర్తను ప్రార్థించింది.

"అలాగే చెయ్యి. కావలిస్తే వాళ్ళకు నీ యిష్టంవచ్చినంత బంగారమూ, మణులూ బహుమానం కూడా చెయ్యి. కాని వాళ్ళ దిక్కుమాలిన సలహాలు వినకు. ముఖ్యంగా నన్ను గురించి, నా అవతారం గురించి వాళ్ళు తెలుసుకో గోరుతారు, వాళ్ళు చెప్పినట్టు చెయ్యకు. చేస్తే నేను నీకు దక్కకుండా పోవచ్చు. అంతటితో నీకు దుర్భరమైన కష్టాలు ఆరంభమవుతాయి," అని నవమన్మథుడు ఆమెతో అన్నాడు.



ఈ మాటతో ఆమె హృదయం తేలిక పడింది. ఆమె తన భర్తతో, "నా ప్రాణమైనా వదులుకుంటాను గాని మిమ్మల్ని వదులుకుంటానా? మిమ్మల్ని ఎంతగా ప్రేమిస్తున్నానో మీ రెరగరు. నాకు ఒక్క ఉపకారం చెయ్యండి। నా అక్కలు కొండ మీదికి వస్తే వారిని వాయుదేవుడు లోయలోకి దించే ఏర్పాటు చెయ్యండి," అన్నది.

తనకు ఇష్టం లేకపోయినా నవమన్మధుడు, ఆమె పై గల మమకారం కొద్దీ, ఆమె కోరినట్టు చేయటానికి అంగీకరించాడు. తెల్లవార వస్తూండగా అతను రోజూ లాగే వెళ్ళిపోయాడు.

ఆ రోజే ఆమె అక్కలు, కొండకు దారి తెలుసుకుని, దాని మీదికి వచ్చారు. అక్కడ చెల్లెలు కనిపించక పోయేసరికి వాళ్ళు రొమ్ములు బాదుకుంటూ, "అయ్యో! చెల్లెలా! త్రిలోకసుందరీ! ఏమైపోయావే! నీ కెన్ని పాట్లు వచ్చాయే!" అని కొండలు మారుమోగేట్లు గట్టిగా శోకాలు పెట్టసాగారు.

అక్కల కంఠాలు వినగానే త్రిలోకసుందరికి ప్రాణం లేచి వచ్చింది. ఆమె భవనం వెలుపలకు పరిగెత్తుకుంటూ వచ్చి, "ఎందుకా శోకాలు? నే నిక్కడే నిక్షేపంలా గున్నాను. వచ్చి నన్ను కౌగలించుకోండి," అని, వారిని కిందికి దించమని వాయుదేవుణ్ణి ప్రార్థించింది.

వెంటనే వాయుదేవుడు అక్కలను త్రిలోకసుందరి ముందు దించాడు. ఆమె వారిని తన భవనంలోకి తీసుకుపోయి,





తనకు గల సౌభాగ్యాన్ని వారికి కళ్ళారా చూపింది. అదంతా చూడగానే అక్కలకు వల్లమాలిన ఈర్ష్య పుట్టుకొచ్చింది. వారు ఆమె భర్తను గురించి గుచ్చి గుచ్చి ప్రశ్నించారు.

త్రిలోకసుందరి తన భర్త చేసిన హెచ్చరిక గుర్తుంచుకుని, తన భర్త యువకుడనీ, అందగాడనీ, అతను వ్యవసాయంలోనూ, వేటలోనూ కాలం గడుపుతాడనీ నోటికి వచ్చినట్టు చెప్పి, ఇక వారిని ఎక్కువసేపు ఉండనివ్వటం తనకే ప్రమాదమని, గబగబా వారికి బంగారమూ, రత్నాలూ కానుక లిచ్చి, వారిని కొండ మీదికి చేర్చమని వాయుదేవుడికి చెప్పింది.

అక్కలు కొండ ఎక్కి ఇంటికి పోతూ తమలో తాము తమ చెల్లెలి ఐశ్వర్యాన్ని తలుచుకుని విషం కక్కుకున్నారు. అడవులపాలైన దానికి ఇంత ఐశ్వర్యమా! తమ చెల్లెలికి ఎంత పొగరెక్కింది! అంత సంపద పెట్టుకుని తమకు ఇంత ముష్టి వేసి, తాము పోతామనకుండానే గబగబా ఇంటి నుంచి సాగనంపింది!

"మనం ఎలాగైనా దీని పొగరు అణచాలి. అది ఇచ్చిన ఈ వాయనాలు ఎవరికీ చూపవద్దు. అసలు మనం దాన్ని చూసినట్టుగా కూడా ఎవరికీ చెప్పవద్దు. పుట్టింటికి వెళ్ళకుండా మనం మన ఇళ్ళకు పోయి, మన చెల్లెలి అంతు తేల్చే ఉపాయం ఆలోచించి మరొకసారి వద్దాం," అని అక్కలిద్దరూ తీర్మానించుకున్నారు. వాళ్లు జుట్టు పీక్కుని, పెద్దపెట్టున ఏడుస్తూ తమ తల్లిదండ్రులకు ముఖం చూపించి, తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయిన తరవాత ఒక రాత్రి నవమన్మధుడు తన భార్యను మరొకసారి హెచ్చరిస్తూ, "నీ అక్కలు ఆడతోడేళ్ళు. వాళ్ళు నీ వినాశానికి పథకం వేస్తున్నారు. వాళ్ళ పథకం పారకుండా చెయ్యకపోతే నీకు అష్టకష్టాలు తప్పవు. నే నెలా ఉంటానో చూడమని వాళ్ళు నిన్ను ప్రోద్బలం చేస్తారు. కాని నేను నీకు ఒక

సారి కనిపించానే అదే ఆఖరి సారవు. నువ్వు యిప్పుడు గర్భవతివి కూడాను. ఈ దశలో నన్ను పోగొట్టుకోవటం నీకు ఎంత అపాయ కరమో బాగా ఆలోచించుకో. జాగ్రత్త." అని చెప్పాడు.

త్రిలోకసుందరి కంట తడిపెట్టుకుంటూ, "నేను మీ ఆజ్ఞలను ఏ మాత్రమూ ఉల్లం ఘించలేదు. ఇకముందు కూడా ఉల్లం ఘించను. మిమ్మల్ని చూసే ప్రాప్తి నాకు లేనేలేదు. మా అక్కలనన్నా చూసి ఆనం దిస్తాను. వాళ్ళు మళ్ళీ వస్తే కొండ దించ మని వాయుదేవుడికి చెప్పండి. ఆ పైన నేను గుడ్డిదాన్నే అనుకుని తృప్తిపడతాను." అన్నది.

నవమన్మధుడు ఆమె కళ్ళు తుడిచి, ఓదార్చి, ఆమెను కౌగలించుకున్నాడు. తిరిగి తెల్లవారేలోపుగా అతను వెళ్ళి పోయాడు.

తెల్లవారగానే అక్కలు కొండ మీదికి వచ్చి, తొందరలో లోయలోకి దూకేశారు. మధ్య దారిలో వాయుదేవుడు వారిని పట్టు కుని క్షేమంగా కింద దించాడు. వాళ్ళు గబాగబా భవనంలోకి ప్రవేశించి, ఆనందం అభినయిస్తూ త్రిలోకసుందరిని కౌగలించు కుని, "కొంచెం ఒళ్ళు చేసినట్టున్నావే, చెల్లెలా? కడుపా ఏమిటి? త్వరలోనే మన్మ థుడి లాటి పిల్లవాణ్ణి కను!" అన్నారు.



ఈ మాటలతో త్రిలోకసుందరి హృదయం పొంగిపోర్లింది. ఆమె వారికి కమ్మని విందు వంటలతో భోజనం పెట్టింది. వాళ్ళు విశ్రాంతి తీసుకుంటూ అసలు విషయానికి వచ్చి, తమ చెల్లెలి భర్త ఎలాటివాడని గుచ్చిగుచ్చి అడగసాగారు.

అమాయకురాలైన త్రిలోకసుందరి, కిందటిసారి తాను ఏమి చెప్పినదీ గుర్తులేక, తన భర్త నడి వయసువాడనీ, జుట్టు అక్క డక్కడా నెరుస్తున్నదనీ, అతను గొప్ప ధనికవర్తకుడనీ, వ్యాపారం చేస్తూ ఉంటా డని అన్నది. ఇలా అని ఆమె తన అక్క లకు దొరికిపోయింది. వాళ్ళు వెంటనే ఆమె మనస్సులో విషం పోశారు.



"అయ్యో, చెల్లెలా! నువ్వెంత అమాయకురాలివే! నీ భర్త ఎవరో కూడా నీకు తెలీదు. అందరి కన్నా నీ క్షేమం హెచ్చుగా కోరే మా దగ్గిరే అబద్ధాలాడుతున్నావు! నీ జాతకంలో నీకు కాబోయే భర్త అధమాధముడని ఉన్నది! వాడు ఏ సర్పరాజో కూడా నీకు తెలీదు. నిన్ను ఈ సుఖసంపదలతో కొంతకాలం మభ్యపెట్టి, వాడి మోజు తీరినాక నిన్ను గుటుక్కున మింగేస్తాడు. అయ్యో, నీ గతి ఏంకానున్నదే, తల్లీ!" అని వాళ్ళు మళ్ళీ శోకాలు పెట్టారు.

అక్కల మాటలు వినగానే త్రిలోకసుందరికి దడ పుట్టుకొచ్చింది. వాళ్ళు తన క్షేమం కోసం ఆరాటపడుతున్నట్టు ఆమె పూర్తిగా నమ్మింది. వాళ్ళు సూచించిన ప్రమాదం సంభవమేనని అనిపించింది. ఎందుచేతనంటే, తాను తన భర్త వాస్తవ రూపం ఎన్నడూ చూడలేదు. అదిగాక అతను తన అక్కల మీద ఎంతో కక్షగా మాట్లాడుతూ వస్తున్నాడు. అందుకు కారణం ఏమై ఉంటుంది? వాళ్ళు తనకు రాబోయే అపాయం గురించి హెచ్చరిస్తారనే అయి ఉంటుంది.

కొత్తగా పుట్టిన ఈ కంగారులో ఆమె తన అక్కలతో, తాను తన భర్తను ఇంతవరకూ చూడలేదని చెప్పేసింది. ఆమె మనస్సు బాగా చెదరి ఉన్నదని గ్రహించి వాళ్ళు ఆమెకు చేయదలచిన దుర్బోధలన్నీ చేసేశారు.

"కంటితో చూడనైనా చూడని భర్తతో కాపరం చేసినదానివి ఎంత అమాయకురాలివి! అతను తప్పక ఏ రాక్షసుడో, మహాసర్పమో అయి ఉంటాడు. అందుచేత ఏం చేస్తావంటే ఒక కత్తిని పదును పెట్టి సిద్ధంగా ఉంచుకో. రాత్రిపూట నీ మంచం కింద దీపం దాచిపెట్టు. నీ భర్త నిద్రపోగానే, ఒక చేత కత్తిపట్టుకుని, రెండవ చేత దీపం వెలిగించి పట్టుకుని, నీ భర్త మెడ బలం కొద్దీ ఒక్కవేటున నరికెయ్యి. ఏ మాత్రం తటపటాయించినా నువ్వు మాకు దక్కవు!" అన్నారు అక్కలు.



తన భర్తలో ఎప్పుడైతే విశ్వాసం పోయిందో, అప్పుడే త్రిలోకసుందరికి అక్కల సలహాలో పూర్తి నమ్మకం కుదిరింది. ఆమె వారికి కృతజ్ఞత తెలుపుకుని, వాయుదేవుడి సహాయంతో కొండ ఎక్కించి, వారి ఇళ్ళకు పంపేసింది.

తరవాత ఆమె ఆ భవనంలో గల ఆయుధాలలో పదునైన కత్తి ఒకటి తీసి తన పడక గదిలో దాచింది. ఒక గిన్నెలో నూనె పోసి, అందులో వత్తివేసి, దాన్ని కూడా మంచం కింద దాచింది. ఆ రాత్రి తన భర్త నిద్రలో మునిగి, దీర్ఘంగా ఊపిరి తీయటం ప్రారంభించాక ఆమె చీకట్లో లేచి, కత్తి పైకి తీసి, దీపం వెలిగించి, రెండూ రెండు చేతులా పట్టుకుని తన భర్త దగ్గిరికి వచ్చింది.

కాని ఆ దీపం వెలుగులో భర్త ముఖం చూడగానే ఆమెకు అమితాశ్చర్యం కలిగింది. అతను రాక్షసుడూ, నాగుడూ కాడు. అంత అందమైన ముఖాన్ని ఆమె ఎన్నడూ ఊహించలేదు. అతని కేసి చూస్తూ ఆమె పారవశ్యం చెంది, వంగి అతన్ని ముద్దు పెట్టుకోపోయింది. అప్పుడు ఆమె చేతిలోని దీపం నూనె అతని చెంప మీద పడి చుర్రుమన్నది.

వెంటనే నవమన్మథుడు నిద్రలేచి, తన భార్య చేతిలో కత్తి, దీపమూ చూసి, ఆమె తన నియమాలను ఉల్లంఘించిందని తెలుసుకున్నాడు. అతను త్రిలోకసుందరితో, "అభాగ్యురాలా, నీపై ప్రేమకొద్దీ నేను నా తల్లి ఆజ్ఞను ఉల్లంఘించాను. గంధర్వుడనై ఉండి కూడా మానవస్త్రీని భార్యగా చేసుకుని నేరస్థుడనైనాను. ఇలా జరగకుండా ఉండగలందులకే నిన్ను మళ్ళీ మళ్ళీ హెచ్చరించాను. దీనికంతకూ ఫలితమేమిటంటే నువ్వు నా తల నరక నిశ్చయించావు. అయినా నిన్ను వదిలిపెట్టటం తప్ప నీకు మరే శిక్ష ఇవ్వలేను. కాని నీకు విషంపోసిన నీ అక్కలను మాత్రం అంతటితో విడవను," అని అప్పుడే బయటికి వెళ్ళిపోయాడు.



త్రిలోకసుందరి అతని పాదాల మీద పడి, గుండెపగిలేటట్టు ఏడ్చింది, కాని ప్రయోజనం లేకపోయింది. ఆమె ఎలాగైనా తన భర్తను చేరుకోవాలనీ, అతని భార్యగా కాకపోతే పరిచారికగానైనా అతనికి చచ్చేదాకా సేవ చేయాలనీ నిర్ణయించుకుని, దారిలేనిమార్గాన పడుతూలేస్తూ బయలు దేరింది.

కొంతకాలానికి ఆమె తన పెద్ద అక్క ఉండే ఊరు చేరి, అక్కను కలుసుకుని, "అక్కా, నువ్వు సలహా చెప్పినట్టే చేశాను. నా భర్త మనం అనుకున్నట్టు హీనుడు కాడు. అతను గంధర్వ యువరాజు, నవ మన్మధుడు. తన ఆజ్ఞ ఉల్లంఘించినందుకు నన్ను ఇంటి నుంచి వెళ్ళగొట్టాడు. ఆయనే నిన్ను పెళ్ళాడతాడట!" అని చెప్పింది.

ఈ మాట చెప్పి త్రిలోకసుందరి వెళ్ళిపోగానే ఆమె పెద్దక్క తన భర్తకు ఏవో అబద్ధాలు చెప్పి ఇంటి నుంచి బయలుదేరింది. ఆమె కొండ మీదికి చేరి, "నవ మన్మధుడా, నీ కోసం వచ్చాను," అంటూ లోయలోకి దూకేసింది. ఆమెను ఈసారి ఏ వాయుదేవుడూ పట్టుకోకపోవటంచేత ఆమె కింద పడుతూనే ప్రాణాలు వదిలింది.

త్రిలోకసుందరి తన రెండో అక్క మీద కూడా ఇలాగే పగ తీర్చుకున్నది. ఆమె కూడా నవమన్మథుడికి భార్య అవుదామన్న దురాశతో కొండ మీది నుంచి లోయలోకి దూకి చచ్చిపోయింది.

ఇదే సమయంలో గంధర్వరాణికి తన కొడుకు చేసిన పని తెలిసి వచ్చింది. ఆమెకు బద్ధశత్రువైన త్రిలోకసుందరిని అతను మోహించి తనకు ద్రోహం చేశాడు. దీనికి తోడు అతను తిరిగి వచ్చేసరికి అతని చెంప మీద బొబ్బ ఉన్నది.

"నా ఆజ్ఞను ధిక్కరించటమే గాక, నా పరమశత్రువును కోడలుగా ఎలా ఆమోదిస్తాననుకున్నావు?" అన్నదామె తన కొడుకుతో. ఆనాటి నుంచి ఆమె అతన్ని ఇల్లు కదలకుండా ఉంచేసింది.

కొంతకాలానికి త్రిలోకసుందరి గంధర్వ లోకం చేరుకుని, గంధర్వరాణి ఉండే చోటికి వచ్చింది. గంధర్వరాణి భటులు ఆమెను పోల్చుకుని, ఆమెను పట్టుకుని గంధర్వరాణి వద్దకు లాక్కొచ్చారు.

"అత్తగారి అడుగులకు మడుగులొత్త వచ్చావా? లేక ముఖం కాలి బాధపడుతున్న నీ మొగుణ్ణి పరామర్శించ వచ్చావా?" అని త్రిలోకసుందరిని నానా హింసలూ పెట్టమని ఆమె తన నౌకర్లను ఆజ్ఞాపించింది.

నవమన్మథుడు త్రిలోకసుందరిని చూసి జాలిపడ్డాడు. తన తల్లి ఆమెను రోజూ హింసలు పెట్టుతూ ఉండటం చూసి అతను భరించలేకపోయాడు. అదీగాక అతను త్రిలోకసుందరి వియోగాన్ని భరించలేని స్థితికి వచ్చాడు.

అందుచేత అతను తల్లిలేని సమయంలో తిన్నగా దేవేంద్రుడి వద్దకు వెళ్ళి తన కథ అంతా చెప్పి, తన తల్లి తన భార్యకు చేస్తున్న దురన్యాయాన్ని గురించి ఫిర్యాదు చేశాడు.

వెంటనే దేవేంద్రుడు సభ ఏర్పాటు చేసి, ఆ సభకు గంధర్వరాణినీ, నవమన్మథుణ్ణీ, త్రిలోకసుందరినీ పిలిచి, గంధర్వరాణి ప్రవర్తనకు సంజాయిషీ అడిగాడు.

"గంధర్వుడైన నా కొడుకు మనుష్య మాత్రురాలిని ఎలా భార్యగా చేసుకుంటాడు? మనుష్యులకూ దేవతలకూ తేడా లేదా? వారిద్దరికీ పిల్లలు పుట్టితే వారెవరవుతారు? వాళ్ళకు ఏ లోకంలోనూ చోటు ఉండదే!" అన్నది గంధర్వరాణి.

"అదొక పెద్ద సమస్య కాదు. ఈ పిల్ల చేత అమృతం తాగించి, దేవత్వం ఇద్దాం!" అంటూ దేవేంద్రుడు అమృతం తెప్పించి, త్రిలోకసుందరి చేత తాగించాడు.

అంతటితో పోనివ్వక దేవేంద్రుడు నవమన్మథుడికీ, త్రిలోకసుందరికీ దేవలోకంలోనే తన ఎదుట వివాహం జరిపించి, వారిద్దరి దాంపత్యానికి ఎలాంటి ఆక్షేపణా లేకుండా చేశాడు. అప్పటికే గర్భవతిగా ఉన్న త్రిలోకసుందరి దేవతాంశ గల ఒక కొడుకును కన్నది.



# అసలు దొంగ

ఒక న్యాయాధికారి వద్దకు ఒక ఫిర్యాదు వచ్చింది. ఎక్కడి నుంచో వచ్చిన ఇద్దరు వ్యక్తులు ఒక ముత్యాలహారం గురించి తగాదా పడ్డారు. హారం ఒకడి చేతిలో ఉన్నది. రెండోవాడు, ఆ హారం తనదనీ, మొదటివాడు దానిని తన వద్ద దొంగిలించాడనీ అన్నాడు. మొదటివాడు, ఆ హారం తనదేననీ, రెండోవాడు దాన్ని కాజేయ చూస్తున్నాడనీ అన్నాడు.

న్యాయాధికారి ఆ హారాన్ని తీసి పరీక్షించి, నిర్ఘాంత పోయి, "ఇది రాజుగారి ఇంటి నుంచి దొంగలు కాజేసిన హారం. మిగతా నగలు ఎక్కడ దాచారో చెప్పండి. చెప్పకపోతే మీ తలలు తీయిస్తాను," అన్నాడు ఉద్రేకంగా.

ఈ మాటకు ఆ ఇద్దరూ బెదిరిపోయి, ఆ హారాన్ని ఆ గ్రామంలో ఫలానా ఇంట దొంగిలించామనీ, మిగిలిన నగల మాట తమకు తెలియదనీ అన్నారు.

వాళ్ళు వర్ణించిన ఇల్లు న్యాయాధికారిది కావటం చేత, న్యాయస్థానంలో ఉన్న రక్షక భటులు వెంటనే వెళ్ళి ఆ ఇల్లు సోదా చేశారు. పోయిన రాజుగారి సొమ్మంతా దొరికింది. న్యాయాధిపతిని ఉరి తీశారు.

—పి. కె. నాగేశ్వరరావు





# అదృష్టం

ఒక ఊళ్ళో ఇద్దరు ముసలి వాళ్ళు ఉండే వాళ్ళు. ఒకడు మంచివాడు, ఒకడు చెడ్డ వాడు. ఒక ఏడు సంవత్సరాది రోజున ఆ ఇద్దరూ కలుసుకున్నారు.

"నాకు రాత్రి చిత్రమైన కల వచ్చింది. నా అదృష్టం ఆకాశం నుంచి వచ్చి పడిందట." అన్నాడు మంచివాడు.

"చిత్రంగానే ఉన్నది. ఎందుకంటే, నాకూ నా అదృష్టం కలలో వచ్చింది. అది భూమిలో నుంచి వచ్చిందట," అన్నాడు చెడ్డవాడు.

"ఎవరి అదృష్టం ఎలా వస్తుందో చూద్దాం." అని మంచివాడు తన ఇంటికి వెళ్ళిపోయాడు.

కొన్ని రోజులు గడిచాక చలిరోజులు వెనకపడ్డాయి.

"ఇవాళ పొలం పని ప్రారంభించవచ్చు." అనుకుని మంచివాడు పారా, పలుగూ తీసుకుని పొలానికి వెళ్ళి, తవ్వటం మొదలు పెట్టాడు. ఉన్నట్టుండి పలుగుకు ఏదో తగిలి ఖంగుమన్నది.

తన పొలంలో పలుగు వాళ్ళు ఎలా వచ్చాయా అని ఆశ్చర్యపడుతూ, తవ్వి తీసి చూస్తే అది ఒక బిందె! అమిత ఆశ్చర్యంతో మంచివాడు దాని మూత తీసి చూసే సరికి, అందులో బంగారు కాసులూ, మొహరీలూ కనిపించాయి. మంచివాడు ఆ బిందెను తిరిగి యథాప్రకారం పెట్టేశాడు.

"పాపం, ఈ నిధి ఆ ముసలాడిది అయి ఉంటుంది. తన అదృష్టం భూమిలో దొరికినట్టు సంవత్సరాదినాడు అతను కల వచ్చిందన్నాడు. వెళ్ళి అతనితో చెబుతాను," అనుకుని మంచివాడు చెడ్డవాడి దగ్గిరికి వెళ్ళి, "పెద్దయ్యా, నీ అదృష్టం నా పొలంలో దొరికింది. బిందె నిండా బంగారు కాసులూ, మొహరీలూ ఉన్నాయి. నా పొలానికి వెళ్ళి

తెచ్చుకో." అని చెప్పి, తాను తన ఇంటికి వెళ్ళిపోయాడు.

అతను ఇంటికి వెళ్ళి తన భార్యతో జరిగినదంతా చెప్పి, "తన అదృష్టం నా పొలంలో దొరికిందని చెబితే, పాపం, పెద్దవాడు చాలా సంతోషించాడు. ఈ పాటికి అతను బిందెను ఇంటికి తెచ్చుకుని ఉంటాడు," అన్నాడు.

"న్యాయమైన పని చేశావు," అన్నది మంచివాడి భార్య.

ఈ లోపల చెడ్డవాడు మంచివాడి పొలానికి వెళ్ళాడు. బిందె తవ్విన చోటు కనిపిస్తూనే ఉన్నది. పై మట్టి తొలగించగానే బిందె కనబడింది. చెడ్డవాడు ఆత్రంగా ఆ బిందెను పైకి తీసి, మూత తెరిచి చూశాడు. అయితే అతనికి బిందె లోపల కాసులూ, మొహరీలూ కనిపించటానికి బదులు పాములు మెలితిరుగుతూ కనిపించాయి.

చెడ్డవాడికి చెప్పరాని కోపం వచ్చింది.

"దొంగ వెధవ, ఎంత మోసం చేశాడూ! ఇందుకు వాడికి తగిన ప్రాయశ్చిత్తం చెయ్యక మానను!" అనుకుని చెడ్డవాడు బిందెను ఇంటికి పట్టుకుపోయాడు.

ఆ రాత్రి చెడ్డవాడు ఆ బిందెతో సహా మంచివాడి ఇంటికి వచ్చి, నిచ్చెన వేసి ఇంటి కప్పు ఎక్కి, దానిలో నుంచి లోపలికి చూశాడు. చలిమంటకు వీపు పెట్టి మంచివాడు పడుకుని ఉండటం చెడ్డవాడికి కనిపించింది. తనకు ఇంత ద్రోహం చేసి, నిశ్చింతగా చలి కాచుకుంటున్న మంచివాణ్ణి చూస్తే చెడ్డవాడికి మరింత కోపం వచ్చింది. అతను బిందె మీది మూత తీసి, దానిని పొగగూడులో నుంచి లోపలికి పెట్టి, కుమ్మరించాడు.

కాని చెడ్డవాడు అనుకున్నట్టు పాములు పడటానికి బదులు, బంగారు కాసులూ, మొహరీలూ మంచివాడి చుట్టూ పడ్డాయి. అతను ఆనందంతో భార్యను లేపి, "చూశావా, నా కల నిజమయింది. మన అదృష్టం ఆకాశం నుంచి పడింది," అన్నాడు.

అటుతరవాత మంచివాడు దారిద్ర్యమన్నది ఎరగకుండా సుఖంగా జీవించాడు.





# ఇద్దరు జ్యోతిష్కులు

కళింగపురంలో సుగుణశర్మ అనే జ్యోతిష్కుడు ఉండేవాడు. ఆయన జ్యోతిషంలోనూ, గణితంలోనూ సంపూర్ణమైన పాండిత్యం సంపాదించాడు. ఆయన జరిగినదీ, జరగబోయేదీ చాలా ఖచ్చితంగా చెప్పగలిగేవాడు. ఆ కారణంగా ఆయన చాలా ధనమూ, గొప్ప కీర్తీ గడించాడు. ఆయనకు "త్రికాలజ్ఞుడు" అన్న బిరుదు ఉండేది. ప్రజలు ఎంతగానో గౌరవించేవారు.

కొంత కాలానికి సుగుణశర్మకు, తనను మించిన జ్యోతిష్కుడు ప్రపంచంలో ఎక్కడన్నా ఉన్నాడేమో తెలుసుకోవాలని కోరిక కలిగింది. ఆ ఉద్దేశంతో ఆయన చాలా దేశాలు తిరిగి, ఎందరో పేరు మోసిన జ్యోతిష్కులను కలుసుకున్నాడు. కాని వారిలో ఒక్కడూ తనతోసరి రాగలవాడు ఆయనకు కనిపించలేదు. చాలామంది చిలవలూ పలవలూ కల్పించి చెప్పారు. కొందరు నోటికి వచ్చిన అబద్ధాలు చెప్పారు. అలాటి జ్యోతిష్కుల మూలానే ప్రజలకు శాస్త్రం పైన విశ్వాసం పోతున్నదని సుగుణశర్మ బాధపడ్డాడు.

ఆయన ఇలా దేశాటన చేస్తూ ఉండగా, అవంతీ నగరంలో ఉండే ఆస్థాన జ్యోతిష్కుడు పేరు ప్రఖ్యాతులుగల వాడనీ, జ్యోతిశ్శాస్త్రంలో చాలా గట్టి వాడనీ తెలియ వచ్చింది.

సుగుణశర్మ అవంతీ నగరం చేరుకుని రాజసభకు వెళ్ళాడు. అవంతీరాజు సుగుణశర్మ ఖ్యాతి గురించి విని ఉండటం చేత, సుగుణశర్మను ఎంతో గౌరవించి, తన ఆస్థాన జ్యోతిష్కుడైన రామశాస్త్రిని పరిచయం చేశాడు. తరవాత ఇద్దరు జ్యోతిష్కులూ చర్చలోకిదిగి ఒకరిలోతు ఒకరు తెలుసుకోవటానికి ప్రయత్నించారు. వారి వాదోపవాదాలు వింటున్న సభికులకు వారిలో

ఏ. ఆనందసాగర్

ఎవరు గొప్ప అయినదీ తెలుసుకోవటం సాధ్యంకాలేదు.

రాజుకు కూడా ఆ జ్యోతిష్కు లిద్దరికి పరీక్షపెట్టి, వారిలో ఎవరు గొప్ప అయినదీ తెల్సుకోవాలని బుద్ధిపుట్టింది. మంత్రి సలహాపై వారిద్దరికీ ఒక పరీక్ష పెట్టదలచి, ''ఈ సాయంకాలంలోగా ఈ ప్రాంతంలో జరగబోయే ఒక సంఘటనను మీరిద్దరూ జోస్యం చెప్పండి. ఎవరు చెప్పినది అక్షరాలా నిజమవుతుందో చూడాలని కుతూహలంగా ఉన్నది,'' అన్నాడు.

రాజు ఇలా అనగానే, ఆస్థాన జ్యోతిష్కుడు రామశాస్త్రి ఏవో లెక్కలు గుణించి, ''ఇప్పటికి సరిగా మూడు గంటలకు ఉరుములతోనూ, మెరుపులతోనూ, తీవ్రమైన గాలితోనూ పెద్ద గాలివాన వస్తుంది. ఆ సమయంలో ఒక పెద్ద తెల్లని చేప సరిగా రాజభవన సింహ ద్వారంవద్ద పడుతుంది,'' అన్నాడు.

రాజు సుగుణశర్మ కేసి చూశాడు. సుగుణశర్మ చిన్నగా నవ్వి, ''మూడు గంటలకు గాలివాన వచ్చేమాట నిజమే. వానతోపాటు పెద్ద చేప పడేమాటా నిజమే. కాని అది నల్లగా కనబడుతుంది. అంతే గాక అది సింహద్వారానికి అరవై అడుగుల దూరంలో ఉంటుంది,'' అన్నాడు.

ఇద్దరి జోస్యంలోనూ కొంత తేడా ఉండటం చేత ఎవరిమాట నిజమవుతుందో చూడాలని రాజుకూ, మిగిలిన సభికులకూ కూడా కుతూహలం కలిగింది.



మూడు గంటల గడువు పూర్తికాగానే వర్షం చిన్నగా ప్రారంభమై, చూస్తూండగానే బ్రహ్మాండమైన గాలివానగా మారింది. ఉరుములతోనూ, మెరుపులతోనూ వాన కురిసి, కొంత సేపటికి నిలిచిపోయింది.

వాన ఆగిపోగానే రాజు మిగిలినవారిని వెంట బెట్టుకుని రాజభవనం వెలపలకు వచ్చి చూశాడు. సుగుణశర్మ చెప్పినట్టుగానే ఒక పెద్ద చేప సింహద్వారానికి ఇరవై అడుగుల దూరంలో పడి ఉండటమే గాక, అది నల్లగా కూడా ఉన్నది. రాజు వెంట ఉన్నవారంతా చాలా ఆశ్చర్యపడ్డారు.

రాజు సుగుణ శర్మను అభినందిస్తూ, "మా ఆస్థాన జ్యోతిష్కుడు రామశాస్త్రి కన్న నువే అన్నివిధాలా గొప్పవాడివి. ఇన్ని రోజులుగా రామశాస్త్రిని మించిన జ్యోతిష్కులు ప్రపంచంలో లేరనుకున్నాను. కాని నువ్వు నిశ్చయంగా అంతకన్న గొప్పవాడివి," అన్నాడు.

రామశాస్త్రి ముఖం అవమానంతో ముడుచుకుపోయింది. అయితే సుగుణశర్మ ఈ పొగడ్తతో పొంగిపోక, రామశాస్త్రిని కౌగలించుకుని రాజుతో, "మహారాజా, రామశాస్త్రి శాస్త్రజ్ఞానంలో నాకు ఏ మాత్రమూ తీసిపోడు. అతనికి లోపించినది ఊహాశక్తి మాత్రమే. నిజానికి రామశాస్త్రి చెప్పిన జోస్యం అక్షరాలా నిజమే. ఆ చేప కిందపడినప్పుడు తెల్లనిదే. అది బురదలో దొర్లి నల్లగా అయింది. అదీగాక, అది పడినది సరిగా సింహద్వారం వద్దనే. అయితే అప్పటికది బతికి ఉండటం చేత, తన్నుకుని తన్నుకుని ఇరవై అడుగులు దూరంగా వెళ్ళింది. రామశాస్త్రి తన శాస్త్రజ్ఞానానికి ఊహాశక్తి జత చేసినట్టయితే నేను చెప్పినట్టే చెప్పి ఉండేవాడు," అన్నాడు.

సుగుణశర్మ అన్న మాటలలో నిజం ఉన్నదని రామశాస్త్రి గ్రహించి, అతణ్ణి చాలా మెచ్చుకున్నాడు.

రాజు ఇద్దరు జ్యోతిష్కులనూ సమంగా సత్కరించి, బహూకరించాడు. రాజు ఏర్పాటు చేసిన పల్లకిలోనే సుగుణశర్మ స్వదేశానికి తిరిగి వచ్చేశాడు.



# నవాబు - ఫకీరు

ఒక వనంలో గొప్ప జ్ఞాని అయిన ఫకీరు నివసించేవాడు. ఆయన దర్శనం చేసుకుని, జ్ఞాన బోధ వినటానికి అనేకులు ఆయన కుటీరానికి వస్తూ ఉండేవారు.

భక్తుల సంఖ్య పెరుగుతున్నకొద్దీ ఫకీరుకు వారిని ఆదరించటం పెద్ద సమస్య అయింది. అందుచేత ఆయన ధన సహాయం కోరి నవాబు వద్దకు వెళ్ళాడు. నవాబుకు ఫకీర్లంటే ఆదరం కావటం చేత రాజభటులు ఫకీరును లోపలికి తీసుకుపోయి, ఒక గదిలో కూర్చో పెట్టారు.

ఆ సమయంలో నవాబు దైవప్రార్థన చేస్తూ, తన రాజ్యాన్ని మరింత పెద్దది చెయ్యమని, తనకు మరింత సంపద కలిగించమని దేవుణ్ణి వేడుకుంటున్నాడు.

అది వినగానే ఫకీరు లేచి బయటికి నడిచాడు. అప్పుడే ప్రార్థనలు ముగించి ఇవతలికి వచ్చిన నవాబు, తన కోసం వచ్చిన ఫకీరు తనను చూడకుండానే వెళ్ళి పోతున్నందుకు ఆశ్చర్యపడి, ఫకీరును వెనక్కు పిలిపించి, ఎందుకు వెళ్ళిపోతున్నారని అడిగాడు.

"నాయనా, నిన్ను యాచింతామని వచ్చాను. కాని నువ్వూ యాచకుడవేనని తెలిసి వెళ్ళిపోతున్నాను," అన్నాడు ఫకీరు.

—ఎ. వివేక





# మూగప్రేమ

ఒక రాజుకు జంతువులంటే చాలా ప్రేమ. ఆయన ఎంత క్రూరమృగాన్ని కూడా హింసించేవాడు కాదు. పైపెచ్చు, నోరు లేని జంతువులను హింసించే వారిని కఠినంగా శిక్షించేవాడు.

ఒక రోజు రాజు గుర్రం మీద నగరంలో తిరుగుతూండగా ఒక చోట ఒక మనిషి ఒక పెద్దపులిని కర్రతో కొట్టుతూ కనబడ్డాడు.

ఆ మనిషి పులిని అలా హింస పెట్టటం చూసి రాజు ఉగ్రుడై, "ఆ నోరు లేని జంతువును ఎందుకు అలా హింస పెట్టేస్తున్నావు?" అని కోపంగా అడిగాడు.

"మహారాజా, ఇది నా పెంపుడు పులి. ఎన్నో ఏళ్ళుగా నేను దీన్ని సాకుతున్నాను. ఇంత కాలమూ బుద్ధిగానే ఉన్నది, కాని ఇవాళ, నేను చూస్తుండగా ఒక మేకను చంపేసింది. అందుచేత దీనికి కాస్త బుద్ధి చెబుతున్నాను." అన్నాడు ఆ మనిషి.

ఈ మాట విని రాజు మరింత మండి పడి, "నువ్వు నోరు లేని జంతువును హింసించటం శాసన విరుద్ధం," అని ఆ మనిషిని కారాగృహంలో పెట్టించాడు.

వెళ్ళిపోతూ ఆ మనిషి, "మహారాజా, నా పులిని జాగ్రత్తగా చూడండి!" అన్నాడు.

రాజు వద్ద అదివరకే అనేక పులులు పెరుగుతున్నాయి. ఈ పులిని కూడా తీసుకుపోయి వాటిలో చేర్చారు.

కొద్ది రోజులు గడిచాయి. రాజు ఒక నాడు తన పెంపుడు జంతువుల పెట్టుపోతలూ, యోగక్షేమాలూ స్వయంగా విచారిస్తూ పులులున్న చోటికి వచ్చాడు. అక్కడి పులుల మధ్య ఆయనకు బక్కచిక్కి, బలహీనంగా ఉన్న పులి కనబడింది.

"ఈ పులి ఇలాగున్నదేమిటి? దీనికేమైనా జబ్బా? చికిత్స ఏమైనా చేస్తున్నారా?" అని అక్కడి పోషకులను అడిగాడు రాజు.

బి. యస్. మోహన్

"మహారాజా, ఇది కొత్తగా వచ్చిన పులి. ఇది ఇక్కడికి వచ్చిన తరవాత ఆహారం ముట్టలేదు. నీరు తాగ లేదు. ఇన్నాళ్ళూ అలాగే పడి ఉన్నది," అన్నారు పోషకులు.

"ఇది ఎక్కడి నుంచి వచ్చింది?" అని రాజు మళ్ళీ అడిగాడు.

"దీని యజమానిని తమరు కారాగృహంలో పెట్టించారు. ఇది అతని పెంపుడు పులి," అని పోషకులు తెలిపారు.

రాజుకప్పుడు జరిగిన సంగతి జ్ఞాపకం వచ్చింది.

"కారాగృహం నుంచి ఆ మనిషిని తీసుకురండి," అని రాజు తన భటులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు ఆ మనిషిని తీసుకు వచ్చారు.

"నీ పులికి నువ్వు ఏమి ఆహారం పెట్టేవాడివి? అది ఏం తినేది?" అని రాజు అడిగాడు.

"అన్ని పులులలాగే అది కూడా మాంసం తింటుంది, మహారాజా!" అన్నాడు ఆ మనిషి.

"అది నా దగ్గిరికి వచ్చాక ఏమీ తినక, చిక్కి శల్యమయింది!" అన్నాడు రాజు.

ఆ మనిషి ఆదుర్దాపడుతూ, "నేను దాన్ని ఒకసారి చూడాలి, మహారాజా!" అన్నాడు.

ఇద్దరూ కలిసి పులులున్న చోటికి వెళ్ళారు. ఆ పులి తన యజమానిని చూడగానే లేచి వచ్చి, అతని కేసి రుద్దుకుంటూ, అతన్ని నాకింది. దాని స్థితి చూసి ఆ మనిషి దాన్ని కౌగలించుకుని బావురుమని ఏడ్చాడు.

అతని చేత్తో ఆహారం పెడితే పులి ఆవురావురున తిన్నది. ఇది చూడగానే రాజుకు కనువిప్పు కలిగింది. జంతువులకు క్రమశిక్షణ ఇవ్వటానికి కొంత హింసించ వలసి వస్తుంది. అది క్రూరత్వం అనిపించుకోదు. ఆ మనిషికి పులి మీదా, ఆ పులికి అతని మీదా ఉన్న ప్రేమలో తనకు నూరోవంతైనా లేదని, తనను ఎన్నడూ ఏ నోరులేని ప్రాణీ ప్రేమించలేదని రాజు గ్రహించాడు.

రాజు అతని శిక్ష రద్దు చేసి, తన వద్ద ఉన్న మృగాలన్నిటికీ అతన్ని ప్రధాన పోషకుడుగా నియమించాడు.





# మహాభారతం

హనుమంతుడు అరటితోట మధ్య పడుకుని ఉన్నాడు. ఎర్రని ముఖమూ, పచ్చని కళ్ళూ, బంగారం లాటి శరీరమూ, పెద్ద మూపులూ కలిగి, దారికి అడ్డంగా పడుకుని ఉన్న హనుమంతుణ్ణి చూసి భీముడు ఏ మాత్రమూ భయపడక, దగ్గిరికి వచ్చి సింహనాదం చేశాడు.

హనుమంతుడు కళ్ళు తెరిచి భీముణ్ణి చూసి, చిన్నగా నవ్వుతూ, "నాయనా, ముసలివాణ్ణి, జబ్బువాణ్ణి. అలిసిపోయి సుఖంగా నిద్ర పోతూంటే ఎందుకు లేపావు? నావంటి జంతువుల మీద నీవంటి జ్ఞాని భూతదయ చూపవచ్చునే! నీకు పెద్దవాళ్ళను ఆదరించటం కూడా తెలియదు లాగున్నది. అసలు ఇటుగా ఒంటరిగా ఎందుకు వచ్చావు? ముందున్న ప్రదేశం దేవతలు సంచరించేది. అక్కడికి మనుషులు పోరాదు. నా మాట విని తిరిగి వెళ్ళు," అన్నాడు.

"నేను క్షత్రియుణ్ణి. కురువంశాన పుట్టినవాణ్ణి, నా పేరు భీమసేనుడు. నువ్వు ఎవరివి? ఇక్కడ ఎందుకున్నావు? నీకీ కోతి రూపం ఎలా వచ్చింది? నాకు దారి ఇయ్యి," అన్నాడు భీముడు.

"నేను వానరుణ్ణి, దారి తొలగను. అఘాయిత్యం చెయ్యక, మర్యాదగా తిరిగి వెళ్ళిపో," అన్నాడు హనుమంతుడు.

"దారి తొలగకపోతే అఘాయిత్యం చెయ్యటం కాదు. నీకు అపాయమే చేస్తాను," అన్నాడు భీముడు.

31. సౌగంధిక పుష్పాపహరణం



"అన్నా, నేను చాలా ముసలివాణ్ణి. జబ్బు మనిషిని. కదలలేను. నీకు నిజంగా వెళ్ళాలనే ఉంటే నన్ను దాటిపో." అన్నాడు హనుమంతుడు.

"దాటి వెళ్ళటం చాలా తప్పని నాకు తెలుసు. లేకపోతే, హనుమంతుడు సముద్రాన్ని దాటినట్టు ఎప్పుడో దాటకపోయానా?" అన్నాడు భీముడు.

"ఎవడా హనుమంతుడు? వాడు సముద్రాన్ని ఎందుకు దాటవలసి వచ్చింది?" అని హనుమంతుడు అడిగాడు.

"నా లాగే హనుమంతుడు కూడా వాయుదేవుడి కొడుకు. నాకు అన్న అన్నమాట. చాలా గొప్పవాడు. రాముడి భార్యను లంకాధిపతి ఎత్తుకుపోతే, హనుమంతుడు ఆమెను వెతుకుతూ సముద్రం దాటి లంకకు వెళ్ళాడు. నేను కూడా ఆ హనుమంతుడికి తీసిపోని బలపరాక్రమాలూ, శక్తీ కలవాణ్ణి. మంచిగా నాకు దారి ఇయ్యి, లేదా దెబ్బతింటావు." అన్నాడు భీముడు.

హనుమంతుడు భీముడి గర్వం తెలుసుకుని, నవ్వు ఆపుకుంటూ, "నాయనా, నన్నెందుకు బాధిస్తావు? నా తోకను పక్కకు నెట్టి నీ దారిన నువ్వు వెళ్ళు." అన్నాడు.

భీముడు నిర్లక్ష్యంగా ఎడమచేత్తో హనుమంతుడి తోక పట్టి ఎత్తబోయినాడు. కాని అది కదలలేదు. అమితాశ్చర్యంతో అతను హనుమంతుడి తోకను రెండు చేతులా పట్టి, తన కున్న బలమంతా ఉపయోగించి కూడా ఆ తోకను కదల్చలేక పోయాడు.

భీముడికి చచ్చేసిగ్గు వేసింది. అతను చేతులు రెండూ జోడించి, "బాబూ, నా ప్రగల్భాలు మన్నించు. నువ్వు ఏ సిద్ధుడివో, గంధర్వుడివో గాని, మామూలు వానరుడివి మటుకు కావు. అభ్యంతరం లేకపోతే నీ కథ ఏమిటో చెప్పు. నన్ను నీ శిష్యుడుగా భావించుకో!" అన్నాడు.

దానికి హనుమంతుడు, "బాబూ, నేనే హనుమంతుణ్ణి. వాలి సుగ్రీవులకు వైరం వచ్చినప్పుడు సుగ్రీవుడు నా సహాయం కోరి, నాతో స్నేహం చేశాడు." అంటూ

రామాయణం కాలం నాటి తన కథ అంతా వినిపించాడు. చివరకు హనుమంతుడు, "నేను ఇక్కడే ఉంటున్నాను. ఇక్కడ గంధర్వులూ, విద్యాధరులూ కూడా రోజూ రామకథను పాటలు కట్టి పాడుతూ ఉంటే విని సంతోషిస్తూ ఉంటాను. ఈ ప్రదేశం మనుష్యులు రాదగినది కాదు. ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని భీముణ్ణి అడిగాడు.

భీముడు హనుమంతుడికి సాష్టాంగపడి, "మహాత్మా, ఇవాళ నీ దర్శనం చేయటం వల్ల నా జన్మ సార్థకమయింది. సముద్రం దాటిన నాడు నీ రూపం ఎలా ఉన్నదీ చూపి నన్ను ధన్యుణ్ణి చెయ్యి," అన్నాడు.

"ఆనాటి రూపం ఈనాడు చూపటం నాకు సాధ్యమా, నాయనా? కాలంతోపాటు సమస్తమూ మారటం లేదా?" అన్నాడు హనుమంతుడు.

అయినా భీముడు వదిలిపెట్టలేదు. అప్పుడు హనుమంతుడు తన శరీరాన్ని భయంకరంగా పెంచాడు. ఆ శరీరం అరటి తోటంతా ఆక్రమించుకుని, ఆకాశం తాకుతున్నట్టుగా ఉంది, సూర్యుడి లాగా ప్రకాశిస్తున్నది. కళ్ళు నిప్పుకణాల లాగా ఉన్నాయి. కోరలు దీర్ఘంగానూ, క్రూరంగానూ ఉన్నాయి. కనుబొమలు దట్టంగా, ముడిపడి ఉన్నాయి. తోక బ్రహ్మాండంగా పెరిగి, నేలను కొట్టుతున్నది.



హనుమంతుడు భీముడితో, "నా రూపం చూశావా, నాయనా? అవసరమైనప్పుడు నా శరీరాన్ని ఇంకా పెంచగలను. శత్రువుల ఎదట ఇంకా భయంకరంగా ఉంటాను. నువ్వు ఆ రూపాన్ని చూడలేవు," అన్నాడు.

భీముడు, "మహాత్మా, దీన్ని చూడలేకుండా ఉన్నాను. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. ఈ రూపాన్ని ఉపసంహరించు," అని బతిమాలుకున్నాడు.

హనుమంతుడు తన మామూలు రూపం ధరించి, భీముణ్ణి కౌగలించుకుని, "నాయనా, ఇది సౌగంధిక వనానికి దారి. వెళ్ళిరా. నీకు శుభం కలుగు గాక. నీకు కష్టం కలిగినప్పుడు నన్ను తలుచుకో. సాహసించి



సౌగంధిక పుష్పాలు కోసేవు! దేవతలతో తగాదా వస్తుంది," అని చెప్పి అంతర్ధానమయాడు.

రెట్టించిన ఉత్సాహంతో భీముడు ముందుకు సాగి, కొండల మధ్యగా ప్రవహించే ఒక నదీతీరాన సౌగంధిక వనాన్ని చూశాడు. వైడూర్యాలను పోలిన నాళాలు గల రకరకాల సౌగంధిక పుష్పాలు సువాసనలు వెదజల్లుతూ ఎంతో అందంగా ఉన్నాయి. ద్రౌపది కోరిక తీర్చటానికి భీముడు ఆ పుష్పాలను కోయబోతూండగా భయంకరాకారులైన రాక్షసుల వంటి కావలావాళ్ళు ఆయుధాలు ధరించి, భీముడి వద్దకు వచ్చి, "అయ్యా, నీ వెవరివి? ఆయుధాలుధరించి ఇక్కడి కెందుకు వచ్చావు?" అని అడిగారు.

"నేను కురువంశంవాణ్ణి. పాండురాజు కొడుకును. ధర్మరాజు తమ్ముణ్ణి. ఈ సౌగంధిక పుష్పాల కోసం వచ్చాను," అన్నాడు భీముడు.

"ఇది కుబేరుడి వనం. ఇక్కడికి మనుష్యులు రారాదు. కుబేరుడి అనుమతి పొంది కావలసినన్ని పూలు కోసుకుపో," అన్నారు రాక్షసులు.

"కుబేరుడు ఎక్కడ ఉన్నాడో! కాక పోయినా, నాలుగు పూల కోసం నేనతన్ని బిచ్చ మడగాలా? నేను క్షత్రియుణ్ణి. కోరినది బలంతో సాధించటం నా ధర్మం. ఇదేమి కుబేరుడి పెరడు కాదు. ఇది దేవుడు సృష్టించిన చోటు. ఇక్కడ ఒకరిని మరొకరు యాచించేదేమిటి?" అని భీముడు, రాక్షసులు వద్దంటున్నా వినకుండా, సౌగంధిక పుష్పాలున్న కొలనులోకి దిగాడు.

అది చూసి రాక్షసులు భీముడి మీద కలియబడ్డారు. భీముడు తన గద గిరగిరా తిప్పి కొందరు రాక్షసులను చావగొట్టాడు. వారిలో కొందరు వెళ్ళి కుబేరుడితో ఇలా జరిగిందని చెప్పారు.

"భీముణ్ణి పూలు కోసుకోనివ్వండి. నాకేమీ అభ్యంతరం లేదు. మీరు అతనికి అడ్డు వెళ్ళకండి," అని వాళ్ళతో అన్నాడు



కుబేరుడు. ఆ రాక్షసులు తిరిగి వచ్చి చూసేసరికి భీముడు బోలెడన్ని సౌగంధిక పుష్పాలను కోస్తూ కనిపించాడు.

ఈ లోపల ధర్మరాజు, తాము ఉన్న చోట భీముడు కనిపించక పోయేసరికి, "భీముడు ఎక్కడికి వెళ్ళాడు? నువ్వు ఎక్కడికైనా పంపావా ఏమిటి?" అని ద్రౌపదిని అడిగాడు.

భీముడు సౌగంధిక పుష్పాలు తెస్తానని ఈశాన్యంగా బయలుదేరి వెళ్ళినట్టు ద్రౌపది చెప్పింది. అప్పుడు ఘటోత్కచుడు తన పరివారంతో వచ్చి, పాండవులను భీము డున్న చోటికి చేర్చాడు. భీముడు ద్రౌపదికి సౌగంధిక పుష్పాలు ఇచ్చాడు. పాండవులు కుబేరుడి అనుమతి పొంది, అర్జునుడి కోసం ఎదురు చూస్తూ గంధమాదన పర్వతం మీద ఉండి పోయారు. వారందరినీ తిరిగి నర నారాయణాశ్రమం వద్ద చేర్చి ఘటోత్కచుడు తన పరివారంతో సహా సెలవు పుచ్చుకున్నాడు.

ఇలా ఉండగా ఒకనాడు జటాసురు డనే రాక్షసుడు ద్రౌపదిని ఎత్తుకుపోవాలనే దుర్బుద్ధితో, బ్రాహ్మణ వేషం వేసుకుని, ధర్మరాజు వద్దకు వచ్చి, తాను పరశురాముడి శిష్యుడిననీ, సమస్త శాస్త్రాలూ, అస్త్ర విద్యలూ నేర్చినవాడిననీ చెప్పాడు. ధర్మ రాజు ఆ మాటలు నమ్మి ఆ రాక్షసుణ్ణి తన వెంట ఉండనిచ్చాడు.

ఒకనాడు భీముడు వేటకు వెళ్ళాడు. రోమశుడూ, ధౌమ్యుడూ, ఇతర మునులూ కాలకృత్యాలు తీర్చుకోవటానికి ఆశ్రమానికి దూరంగా వెళ్ళారు. ఆ సమయంలో జటా సురుడు పాండవుల ఆయుధాలన్నీ కాజేసి, ముగ్గురు పాండవులనూ, ద్రౌపదినీ ఎత్తుకుని పారిపోసాగాడు. సహదేవుడు మాత్రం ఎలాగో వాడి భుజం మీది నుంచి జారి, వాడు కాజేసిన ఆయుధాలలో కత్తి ఒకటి లాగేసుకుని, భీముడి పేరుపెట్టి గట్టిగా అరుస్తూ రాక్షసుడి వెంట పడ్డాడు.

ధర్మరాజు వాడితో, "ఓరీ, దుర్మార్గుడా? ఎందుకిలా అధర్మం చేస్తున్నావు? ధైర్యం

ఉంటే మా ఆయుధాలు మా కిచ్చి, మాతో యుద్ధం చెయ్యి. నీకు మే మేమి కీడు చేశాం? పై పెచ్చు మా అతిథిగా ఉంచుకున్నాం,'' అంటూ ధర్మపన్నాలు ప్రారంభించాడు.

అది చూసి సహదేవుడు, ''పిడితో మాటలేమిటి? చాతనైతే వాణ్ణి చంపాలి. లేదా వాడి చేతిలో చావాలి. మరో మార్గం లేదు,'' అంటూ రాక్షసుడి మీదికి వచ్చాడు. అంతలోనే భీముడు ఎటు నుంచో వచ్చి పడ్డాడు. జటాసురుడు ధర్మరాజునూ, నకులుణ్ణీ, ద్రౌపదిని కింద ఉంచి భీముడితో కలియబడ్డాడు. జటాసురుడు బలహీనుడైపోయే దాకా భీముడు వాడితో మల్లయుద్ధం చేసి, చివరకు వాణ్ణి పైకెత్తి, నేల కేసి కొట్టి చంపేశాడు.



అందరూ ఆశ్రమానికి తిరిగి వచ్చారు. అర్జును డింకా రాలేదు. అతను వెళ్ళి అయిదేళ్ళయింది. అతని కోసం నిరీక్షిస్తూ పాండవులు ఆ ప్రాంతాల ఉండే ఇతర పర్వతాలూ, ఆశ్రమాలూ చూస్తూ కాలం వెళ్ళబుచ్చారు.

ఒకనాడు పాండవులు నలుగురూ ఒక చోట కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ ఉండగా ఒక విమానం ఆకాశంలో ప్రకాశిస్తూ కనిపించింది. వారున్న కొండ పక్కగా దిగింది. అందులోనుంచి దేవతా పురుషుడులాగా అర్జునుడు దిగాడు. స్వర్గం నుంచి తిరిగి వచ్చిన అర్జునుడు అన్నలకు నమస్కరించి, తమ్ములను కౌగలించుకుని, వారి పక్కనే కూర్చున్నాడు.

పాండవులు ఇంద్రుడి రథాన్ని, దాని అందాన్ని వింతగా చూశారు; దానికి సారథి అయిన మాతలిని గౌరవించి, మర్యాదలు చేశారు; స్వర్గంలోని క్షేమ సమాచారాలు అడిగి తెలుసుకున్నారు. వారి ప్రశ్నల కన్నిటికీ మాతలి తగిన సమాధానాలు చెప్పి, రథాన్ని తిరిగి స్వర్గానికి తీసుకుపోయాడు.

ఇంద్రుడు అర్జునుడికి అనేక దివ్య వస్త్రాభరణాలు ఇచ్చాడు. అర్జునుడు వాటిని ద్రౌపది కిచ్చి, ధర్మరాజు దగ్గిరే కూర్చుని,

స్వర్గంలో తనకు కలిగిన అనుభవాలన్నిటినీ పూసగుచ్చినట్టు వివరించి ఇలా చెప్పాడు:

"దితికి పులోమా, కాలకా అని ఇద్దరు కుమార్తెలు. వాళ్ళు బ్రహ్మను తమ తపస్సు చేత మెప్పించి, తమ సంతతికి దేవదానవుల చేత చావు లేకుండానూ, హిరణ్య అనే గొప్ప నగరం వారికి నివాసంగానూ వరాలు కోరారు. ఆ కారణంగా పౌలోములూ, కాలకేయులూ ఆ నగరంలో ఉంటూ, దేవతలను లక్ష్యపెట్టకుండా జీవిస్తూ వచ్చారు. నేను ఆ రాక్షసులను జయించిన అనంతరం, వారి నగరం ప్రవేశించాను. రథం నడపటం చాలా కష్టమయింది. దారికి అడ్డంగా రాక్షసుల శవాలు గుట్టలుగా పడి వున్నాయి. నగరమంతటా రాక్షస స్త్రీల రోదనం వినిపించింది. రథం చప్పుడు విని ఆ స్త్రీలు ఇళ్ళలో దూరి దాక్కున్నారు. ఆ నగరం మొదట నిర్మించినప్పుడు దేవతల వశంలోనే ఉండేదనీ, ఇంద్రుడు అక్కడ ఉండేవాడనీ, బ్రహ్మ వరం మూలంగా రాక్షసులు దేవతలను వెళ్ళగొట్టి ఆ నగరాన్ని ఆక్రమించుకున్నారనీ మాతలి నాకు చెప్పాడు. పౌలోమ, కాలకేయులను ఎలా నిర్మూలించటం అని ఇంద్రుడు బ్రహ్మను అడగగా, దేవదానవ జాతులకు చెందనివాడి వల్లనే అది సాధ్యమవుతుందని బ్రహ్మ చెప్పాడట. ఇంద్రుడు ఆ పనికి నన్ను నియోగించి, కాలకేయులను చంపటానికే నాకు దివ్యాస్త్రాలను ఇప్పించాడు."

మర్నాడు, అందరూ కాలకృత్యాలు తీర్చుకున్న అనంతరం ధర్మరాజు అర్జునుణ్ణి పిలిచి, అతను సాధించుకు వచ్చిన అస్త్రాలను చూపమన్నాడు. అర్జునుడు శుచి అయి, దేవదత్తమనే తన శంఖం మొదలుకుని తన వద్ద గల దివ్యాస్త్రాలన్నిటినీ చూపించసాగాడు. ఆ సమయంలో నారదుడు వచ్చి అర్జునుడితో, "అర్జునా, ఈ అస్త్రాలను తగిన కారణం లేకుండా ఎన్నడూ ప్రయోగించకు. అందువల్ల చాలా ప్రమాదం ఉంటుంది. యుద్ధంలో వీటిని నువ్వు ప్రయోగించేటప్పుడు నేను వచ్చి చూస్తానులే!" అని చెప్పి వెళ్ళిపోయాడు.





# శివపురాణం

## 8

నారదుడు చెప్పిన ప్రకారం పార్వతి తన చెలికత్తెలను వెంట బెట్టుకుని శృంగ తీర్థానికి వెళ్ళి, పంచాక్షరీ మహామంత్రం జపిస్తూ తీవ్రమైన తపస్సు చేయసాగింది. ఆమె ఒక్క ఆకు కూడా తినకుండా తపస్సు చేస్తూ ఉండటం చూసి, అక్కడి మునులు ఆమెను "అపర్ణ" అని పిలవ నారంభించారు.

ఒకనాడు మేనకా హిమవంతులు తమ కుమార్తెను చూడ వచ్చి, ఆమె శుష్కించి ఉండటం చూసి భయపడి, "అమ్మా, ఆహారం కూడా మాని ఎందుకు ఈ ఘోర తపస్సు చేస్తున్నావు? మన్మథుణ్ణి మసి చేసిన శివుడు నీ పట్ల అనుగ్రహిస్తాడా? అతను విరాగి, దయాహీనుడూ, ముక్కోపీనూ. అందని పండుకు ఎందుకు ఆశిస్తావు? ఇంటికి వచ్చెయ్యి." అన్నారు.

పార్వతి ఈ మాటలు విని, "మీరు మొదట నాతో ఏమన్నారు? శివుడికి నన్నిచ్చి పెళ్ళి చేస్తామనలేదా? నా తపస్సుతో నేను ఆయనను మీ అల్లుడుగా చేస్తాను. నా కోసం ఏ మాత్రం దిగులు పడక, మీరు ఇంటికి వెళ్ళి, సుఖంగా వుండండి." అని తన తల్లి దండ్రులతో అన్నది.

ఈ లోపుగా శివుడు పార్వతిని ఎలా పెళ్ళాడటమా అని మథనపడి పోతున్నాడు. అప్పుడు బ్రహ్మ, విష్ణు, దేవేంద్రాదులు శివుడి వద్దకు వచ్చి, అతని వల్ల మర్యాదలు పొంది, "మహేశ్వరా, నువు పార్వతిని పెళ్ళాడి లోకాలకు మేలు చెయ్యవెందుకు? నీకు పుట్టిన కొడుకు చేత తప్ప చావు లేకుండా తారకుడు వరం పొంది ఉన్నాడు. వాడు చస్తేనే గాని లోకాలు సుఖపడవు." అన్నారు.

అట్ట చివరి బొమ్మ

ఈ మాటలకు శివుడు లోపల సంతోషించి కూడా, పైకి వారితో, "పెళ్ళాడితే తపస్సు సాగదు. మన్మథుణ్ణి జయించవచ్చు గాని స్త్రీల చూపుల బాణాలకు తట్టుకోవటం కష్టం. పార్వతితో గృహస్థాశ్రమం గడపటం కన్న తపస్సు చేసుకోవటమే మంచి దనుకుంటున్నాను," అన్నాడు.

ఇందుకు బ్రహ్మ మొదలైనవారు ఒప్పుకోక, గృహస్థాశ్రమమే గొప్పదనీ, భార్య లేనివాణ్ణి ఎవరూ గౌరవించరనీ, శివుడు గృహస్థుగా ఉంటూనే తపస్సు చేసి, రాజయోగిగా జీవించటం వల్ల లోకాలకు మేలు కలుగుతుందనీ హెచ్చరించారు.

వారు చెప్పినట్టే చేస్తానని మాట ఇచ్చి శివుడు బ్రహ్మ మొదలైన వారిని పంపేశాడు. కాని, అతనికి పార్వతిపై విరహం ఉన్నప్పటికీ, పార్వతి మనస్సు స్వయంగా తెలుసు కోవాలనిపించింది. అందుచేత ఆయన ముసలి యతి రూపం దాల్చి, దండమూ, కమండలమూ ధరించి, పార్వతి తపస్సు చేసుకుంటున్న చోటికి వెళ్ళాడు. పార్వతి ఆయన తేజస్సు చూసి, బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో ఒకరై ఉంటాడనుకుని, ఆయనను పూజించి, స్వాగతమిచ్చి, "తమరు ఎవరు? నేను తపస్సుచేసుకుంటున్న ఈ తీర్థప్రాంతానికి ఎందుకు వచ్చారు?" అని అడిగింది.

"నేను బ్రహ్మవంశానికి చెందినవాణ్ణి. లోకాలక్షేమం చూస్తూ తిరుగుతూ ఉంటాను. నువ్వు ఎవరి కుమార్తెవు? దేనికోసం ఇలా



కఠోర తపస్సు చేస్తున్నావు?" అని శివుడు ఆమెను అడిగాడు.

పార్వతి ఆయనతో, "నేను మేనకా హిమవంతుల కుమార్తెను. నన్ను పార్వతి అని పిలుస్తారు. ఈశ్వరుడు కైలాసం మీద తపస్సు చేస్తూ ఉంటే నేను ఆయనకు పరిచర్యలు చేస్తూ ఉండేదాన్ని. అప్పుడు ఒకనాడు మన్మథుడు ఆయనను తన పంచ బాణాలతో కొట్టేసరికి, ఆయన మన్మథుణ్ణి తన ఫాలాగ్నితో దహించాడు. తరవాత నారదుడు పంచాక్షరీమంత్రం ఉపదేశం చేగా, ఆ మంత్రాన్ని జపిస్తూ, శివుణ్ణి భర్తగా పొందటానికి ఇక్కడ తపస్సు చేస్తున్నాను. ఇంతగా తపస్సు చేసినా శివుడికి ఇంకా నా పైన అనుగ్రహం కలగలేదు. అందుచేత అగ్ని ప్రవేశం చేసి ఈ దేహం చాలించా లనుకుంటున్నాను." అని చెప్పింది.

శివుడు ఆమెతో, "నువ్వు చాలా పొరపాటు చేస్తున్నావు. ఈశ్వరుడు విరాగి. తపస్సు చేసుకునేవాడు. నువ్వు నీ తపస్సుతో లోకాలకు ప్రమాదం కలిగించేకన్న ఇంటికి తిరిగి వెళ్ళి దేవతలలో ఒకణ్ణి వివాహం చేసుకోవటం మంచిది," అన్నాడు.

"ఇక మీరు వెళ్ళవచ్చు. నేను నా అభిప్రాయం మార్చుకోను," అన్నది పార్వతి చిరాకుపడి.

"అలాగే వెళతాను. కాని, వెళ్ళే ముందు నీకు కొంత హితం చెప్పాలి. శివుడు దరిద్రుడు, పట్టు బట్టలు కట్టడు, చర్మాలు



ధరిస్తాడు. ఎక్కి తిరగటానికి ఎద్దు తప్ప మంచి వాహనం లేదు. దయ్యాలనూ, భూతాలనూ వెంట వేసుకు తిరుగుతాడు. ఒంటికి గంధం పూసుకోడు, బూడిద పూసుకుంటాడు. అతన్ని పెళ్ళాడి ఏం సుఖపడతావు?'' అన్నాడు శివుడు.

పార్వతికి తీవ్రంగా కోపం వచ్చింది. ''నువ్వు దొంగ యతివి. జ్ఞానివని భ్రమపడ్డాను. శివుడు అష్ట ఐశ్వర్యాలు గలవాడు. శివదూషణ చేసినవారు ఏడు జన్మలపాటు దరిద్రం అనుభవిస్తారు,'' అని తన పరిచారికలను పిలిచి, ''ఈ యతిని అవతలికి గెంటండి,'' అన్నది.

శివుడు నవ్వి, ''పార్వతీ, నేను శివుణ్ణి. నీ మనసు తెలుసుకుందామని యతి వేషంలో వచ్చాను. నీ ఎడబాటుతో చాలా బాధపడుతున్నాను. నా వెంట కైలాసానికి వచ్చెయ్యి,'' అన్నాడు, పార్వతి చెయ్యి పట్టుకుని.

శివుని చేయి విడిపించుకొని చూసేసరికి పార్వతి కళ్ళకు అసలు శివుడే కనిపించాడు. ఆమె ఆయనకు క్షమాపణ చెప్పుకుని, ''ఇలా నీ వెంట రావటం భావ్యం కాదు. నా తల్లిదండ్రుల అనుమతి పొంది, నన్ను వివాహం చేసుకుని, నీ వెంట తీసుకు వెళ్ళు,'' అన్నది.

ఆమె శివుడికి నమస్కరించి, తన పరిచారికలతో సహా తన ఇంటికి వెళ్ళిపోయింది. మేనకా హిమవంతులు జరిగిన సంగతి తెలుసుకుని సంతోషించి, పార్వతీ వివాహానికి మంచి ముహూర్తం నిశ్చయించి, పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించారు.

శివుడు కూడా కైలాసానికి తిరిగి పోయి, ప్రమథగణాలతో, మన్మథుడు తనను పూల బాణాలతో కొట్టినది మొదలు తన మనసు పార్వతి మీద లగ్నమై, తపస్సు మీదికి పోవటం లేదని, పార్వతిని వివాహం చేసుకోగోరుతున్నానని, అందుకు సప్త మహర్షుల మధ్యవర్తిత్వం కావాలని అన్నాడు.

వెంటనే నందీశ్వరుడు బయలుదేరి వెళ్ళి, సప్త మహర్షులను వెంట బెట్టుకుని కైలాసానికి తిరిగి వచ్చారు.



# 118. మరకత బుద్ధాలయం

బాంగ్‌కాక్ (సయామ్) నగరంలో మూడు వందల చిల్లర దేవాలయాలున్నాయి. అన్నిటి శిల్పాల లోనూ, సౌందర్యంలోనూ మరకత బుద్ధుడి ఆలయం ఉత్తమోత్తమమైనది. ఇది రాజవంశానికి చెందిన ఆలయం. రాజప్రాంగణంలోనే ఉన్నది. రాజవంశీయుల ఆరాధనలన్నీ అనాదిగా ఇక్కడే జరుగుతున్నాయి.



Photo by Prabhakar Mahadik



సిరిపురం క్వార్టర్స్,
విశాఖపట్నం

తింటే కడుపు నొప్పి

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు సెప్టెంబర్ నెల 10వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు డిసెంబర్ సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట :
కుందేలు

మూడవ అట్ట :
చిరుతపులి

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'





ఉన్నత
ఆశయాలతో
ఉన్నారా?

వాడండి డీలక్స్ కేమెల్ ఇంక్






Vision 591 Tel

# రోజంతా సుఖసంతోషాలలో మునిగితేలారా?



